సంవత్సర చందా
రు 12-0-0
విడిప్రతి 4 అ



సచిత్రవారపత్రిక

Founder K NAGESWARA RAO

సంపుటము 46
సంచిక 2
16-9-53

విజయ భాద్రపద శుద్ధ అష్టమి; బుధవారం



ఆ పరమేష్ఠికి

చిత్రకారుడు: పి. వి. రామారావు—విశాఖపట్నం.

# విషయానుక్రమణిక



# దసరా సంచిక

## పిల్లలకు ప్రత్యేకాకర్షణ

# కథలు, గేయాలు, చిత్రాల రచనలో పోటీ

రాబోయే 'విజయదశమి' పండుగకు (1953 అక్టోబరు 17 వ తేదీ) ఆంధ్రపత్రిక సచిత్ర వార పత్రిక పిల్లల ప్రత్యేక సంచికగా వెలువడుతుందని పాఠకులకు తెలుపడానికి ఆనందిస్తున్నాము బాల బాలికలకు ఉల్లాసం, విజ్ఞానం కలిగించే చక్కని కథలు, గేయాలు, వ్యాసాలు, బొమ్మలతో పత్రిక ఆకర్షణీయంగా తయారవుతుంది.

బాల బాలికల రచనాశక్తిని, చిత్రలేఖనాసక్తిని ప్రోత్సహించడానికి గాను పోటీ పెడుతున్నాము. ఈ పోటీలో ఒక మంచికథకు, ఒక మంచిపాటకు, ఒక మంచిబొమ్మకు బహుమతు లివ్వబడతాయి.

ఈ సందర్భంలో రచనలు, చిత్రాలు పంపదలిచేవారు ఈక్రింది అంశాలను గుర్తుంచుకోవాలి.

* పదిహేనేళ్లలోపు బాల బాలికలు మాత్రమే ఈపోటీలో పాల్గొనవచ్చును.
* కథలు, గేయాలు, బొమ్మలు స్వతంత్రమైనవై ఉండాలి.
* కథలు గేయాలు కాగితానికి ఒకేప్రక్క సిరాతో స్పష్టంగా వ్రాయాలి.
* బొమ్మలు రంగులలో కాని, రంగుకాగితం పైన కాని సిరాలతో వ్రాసినవిగాని పనికిరావు. ఇండియన్ ఇంక్ తోగాని పెన్సిల్ తోగాని వ్రాసిపంపాలి.
* రచనలు, బొమ్మలు **1953 సెప్టెంబరు 15 వ తేదీ లోగా** మాకు చేరేవిధంగా పంపాలి.
* రచయితలు చిత్రకారులు తమ పూర్తిపేరు (ఇంటిపేరు కూడా) వయస్సు, చిరునామా అన్నీ వివరంగా రచనలూ చిత్రాలతో పాటు వ్రాసి పంపాలి.
* స్వీకరించబడని రచనల్ని, బొమ్మల్ని తిప్పి పంపాలని కోరేవారు చాలినంత స్టాంపుకూడా చేర్చి పంపాలి.
* కవర్లపైనా లేక రేపర్లపైనా "ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక దసరా పోటీకోసం" అని స్పష్టంగా వ్రాసినవి మాత్రమే పోటీకి స్వీకరించబడతాయి

# కాలక్షేపం

"సత్య, మనృతంబు;
పరుషోక్తి, సరసభావః
ప్రాణిహింసయు, దయయు;
లోభంబు, నీగి;
కనకసంగ్రహ, వ్యయములు
గలుగు, వార
రమణి కైవడి, బహురీతి
రాజనీతి."

తా॥ రాజనీతి అనేది వేశ్యవలె బహు
రీతిగా ఉంటుంది. ఒకప్పుడు సత్యము
మరొకప్పుడు అసత్యము — ఒకప్పుడు కఠిన
వాక్యములు, మరొకప్పుడు సరసాలాపము-
ఒకప్పుడు ప్రాణిహింస, మరొకప్పుడు
దయ- ఒకప్పుడు పిసినిగొట్టుతనము, మరొక
ప్పుడు దానములు చేయుట — ఒకప్పుడు
బంగారమును నిల్వ చేయుట, మరొక
ప్పుడు విరివిగా ఖర్చు చేయడం - ఈవిధంగా
రాజనీతి సమయోచితంగా ఉంటుంది.

సమయోచితంగా సర్దుకొనిపోతూ
ఉండడం సవ్యమైన పద్ధతి కాదని ఎవ్వరూ
వాదించరు. గాలి వీస్తూఉంటే, గదిలో
పడుకుంటాం. ఆకు అల్లాడకపోతే ఆరు
బయట పడుకుంటాం. ఇందులో తగాదా
ఏమీ లేదు. ఇదంతా పంచభూతాలతో
సంబంధించిన ప్రసక్తి. శరీరం కోరేది
సుఖం. రుచించినదే భుజిస్తాం. కాని,
ఆహార విహారాలలోకూడా ఒక నియమం
ఉండవలెనని ఆరోగ్యశాస్త్రం తెలిసినఆయు
ర్వేద వైద్యులు వారి వారికి అనుభవసిద్ధము
లైన అనేక అంశములను సూత్రప్రాయంగా
గ్రంథస్థం చేసినవిధంగా బోధిస్తూ ఉన్నారు.
చల్లని గాలిలో పరుండవలెనని శరీరం కోరు
తున్నట్లుగా కన్పిస్తుంది. కాని రెండంతస్తుల
మేడమీద ఆరుబయట హాయిగా శయ
నించిన ఒక విద్యార్థి తెల్లవారేసరికి కళ్ళు
మూసికొని, పెద్ద నిద్దురపోతూ ఉన్నాడు.
హాస్టలులోని మిగిలిన విద్యార్థులు పైకివెళ్ళి
చూచారు. కాని, ఆ యువకుడు వాళ్లను
కళ్లు తెరచి చూడలేదు. చల్లగాలి కావా
లని అంత ఎత్తయిన మేడమీద ఆరుబయట
ఆరాత్రిఅంతా నిద్రించడంవల్ల వచ్చిన ఉప
ద్రవం అది. (*Brain Paralysis*) మస్తిష్క
వాతం కమ్మినదన్నారు.

మెదడులో రక్తనాళం చలికి ముకుళించి
పగిలి రక్తం చెదరి మెదడులోని నాడులు
పనిచేయక స్తంభించి గుండె ఆగిపోయి
ప్రాణం ఉత్క్రమణం అయినదని వైద్యులు
దీనినిగురించి వివరించి చెప్పారు. కనుక,
శరీరం కోరిన ప్రకారముగా శాకపాకాలు
తినడానికి వీలులేదు. నిర్భయంగా నిద్ర
పోవుటకూ వీలులేదు. మనము అలవాటు
చేసినవానికే, మనమనస్సు మనలను యీడ్చు
కొనిపోతుంది. నల్లమందు అలవాటైనవానికి
ఆ నల్లమందు అతనిఖామందువలె అత
నిని కళ్లెంపట్టి నడిపిస్తుంది. ఎక్కడికి నడి
పిస్తుంది? మతిలేని స్మృతిలేని దుర్గతిలోకి
నడిపిస్తుంది. బుద్ధిపూర్వకంగా చేసికొన్న
యీ అలవాటువల్ల బుద్ధిలేని స్థితి ఏర్పడు
తుంది. కాని, మరికొన్ని అభ్యాసములవల్ల
బుద్ధిబలం మరింత వృద్ధిఅవుతుంది. సరస్వతీ
ఆకుతో చేసిన లేహ్యంగాని, బ్రాహ్మీ
రసాయనంగాని (సరస్వతీ ఆకు రసాయనం
గాని) నిత్యం సేవిస్తే, బుద్ధిబలం బాగా
వృద్ధి అవుతుంది మెదడు బాగా పని
చేస్తుంది. కనుక యీ శరీరాన్ని కూడా
కొన్ని నియమ పద్ధతులలో
ఉంచినట్లయితే, జీర్ణశక్తి బాగా తేజో
వంతంగా ఉంటుంది. అగ్నిమాంద్యం
ఉండదు. జఠరాగ్ని ప్రజ్వలిస్తూ ఉంటుంది.
ఏ పదార్థం ఏ పద్ధతిగా పచనంచేసి ఏ
విధంగా భోజనం చెయ్యాలో, గ్రహించి,
ఆ విధంగా మన అభిరుచులను నిగ్రహించి,
అటువంటి అలవాట్లు చేస్తే, ఆరోగ్యాన్ని
వడ్డీకి వేసినట్లుగా అనేక రెట్లుగా వృద్ధి
అవుతూ ఉంటుంది. దేహారోగ్యం ఎంత
యోగ్యంగా ఉంటుందో, దానినిబట్టి, బుద్ధి
బలం కూడా వృద్ధికావడానికి అవకాశాలు
కల్పించవచ్చు. కనుక, కండ, ఎముక,
రక్తంతో కూడిన శరీరానికి దాని వృద్ధి
వికాసంకొరకై, దాని పెంపు సొంపుల
కొరకై కొన్ని నియమాలు, అలవాట్లు
చెయ్యాలి. ఈ నియమాలే ఆరోగ్య
శాస్త్రంలో ఓనమాలు.

తన శరీరవిషయంలో యిన్ని నియమాలు
అనుసరించవలసిన అగత్యం, నిత్యకృత్యంగా
స్థిరసత్యంగా కన్పిస్తూ వున్నటువంటి సంద
ర్భంలో, ఒక మనిషి ఇంకొక మనిషితో
వ్యవహరించుటకు అనుసరించవలసిన పద్ధతు
లలో నియమాలు అక్కరలేదని ఎవరైనా
సవాలుచేసి, చివాలున అనగలడా? బండి
చక్రములు క్రమముగనుండా క్రమముగ
నుండా గిర్రున తిరుగవలెనంటే, చక్రానికి
యిరుసుకూ మధ్య ఏదైనా తైలం ఉండాలి.
"ఇరుసున కందెన బెట్టక పరమేశ్వరు
బండియైన - పారదు సుమతీ"

స్నేహసంబంధం వల్లనే, సహకార
సద్భావ సాహచర్య సామరస్యంవల్లనే,
సంసార చక్రం తిరుగుతోంది. స్నేహం
అనే మాటకు సంస్కృతంలో తైలం అనే
అర్థం ఉంది. నెయ్యం అనేది నెయ్యికంటె
జిడ్డుగల దొడ్డపదార్థం. ఈ యుగంలో
స్నేహం ఉన్న చోటనే తైలం - తైలం
ఉన్నచోటనే స్నేహం అనే విషయం
మరింత నిర్దుష్టంగా స్పష్టమవుతోంది.
తైలం ఉంటేనే "బంధువులం" అంటారు.
నెయ్యి బాగా వడ్డించే హోటలుకు వెయ్యి
మంది వస్తారు. ఢిల్లీకి వెళ్ళినా యీమాటకు
మళ్ళీ తిరుగులేదు. తైలం లేనిదే సర్కారు

(53-వ పేజీ చూడండి)

## మనదేశం!

జబ్బల్పూరునుంచిఒకవార్త:
ఇద్దరన్నదమ్ముల ఆస్తి
పంపకాలలో తనకు అన్యాయం
జరిగిందని తమ్ముడు ఒక ముష్టి
వాడిని తన తరఫున నిరాహార
దీక్షపూనడానికి డబ్బిచ్చి నియో
గించాడట! ఆ ముష్టివాడు
'అక్రమం చేసినందుకు నిరా
హారదీక్ష' అని వ్రాసిన ఫలకం
చేతబట్టి రెండు రోజులు అన్న
ఇంటిముందు నిలబడ్డాడు. ఇంక
ఇది పనిగాదని ఆస్తి పంపకా
నికి పంచాయతీదార్లు పూను
కున్నారు.

# స్వార్థం కోసం

[ఇది దృశ్యనాటిక కాదు. శ్రవ్యనాటిక అంతకన్నా కాదు, వ్యంగ్యనాటిక అవునో కాదో తెలియదు. కాని యిదిమాత్రం నిజం! ఇది నాటిక! "ఇందు వచ్చు పాత్రలు" అని రాయడానికి వీలులేనన్ని పాత్రలు! కాలం వర్తమానం.]

[బ్రహ్మాండమయిన పర్వతం.

నిటారుగావున్న ఆ పర్వత శిఖరంమీద, అతి ప్రమాదకరమయిన పరిస్థితిలో, ఎవరికీ అందరానిచోట వొక మనిషి నిలబడి వుంటాడు. 'అతనక్కడికెల్లా వెళ్లాడూ?'- అంటే చెప్పలేం, కాని, అతనక్కడ వున్నాడు. 'అతను తప్ప మరెవ్వడూ అక్కడికి వెళ్లలేడు' - అంటే అదిమాత్రం నిజం! చిన్న నిచ్చెనా, పగ్గాలూ, వెదురు కర్రలూ అక్కడ వుంటాయి! ఎవరో అతన్ని దింపడానికి ప్రయత్నించినట్టూ విఫలులయినట్టూకూడా మనం గ్రహిస్తాం!

అంటే, ఆ మనిషి, ఆ మహాకాళిపర్వతం మీద, ఆ స్థితిలో, చాలాకాలంనించీ వున్నాడు సుమా అని మాత్రం మన కొక అభిప్రాయం కలుగుతుంది. అక్కడ తగు మాత్రం (అంటే వేలమీద లెక్కపెట్టవచ్చు) జనసమూహం వుంటుంది. 'చుట్టా, బీడీ, సిగరెట్', 'సోడా,/కూల్ డ్రింక్స్', 'దువ్వెన్నలూ, రిబ్బన్లూ, బొత్తాములూ' 'ఐస్ ఫ్రూట్'లాంటి కేకలు మిన్నుముట్టు తుంటాయి.

అడావిడిగా పరిగెత్తే జనం. జనాన్ని చీల్చుకునీ, దూసుకునీ పోయే వాళ్ళూ, స్త్రీలూ, పిల్లకాయలూ, వొచ్చే వాళ్లు వొస్తూనే వుంటారు! గుసగుసలు, అస్పష్టంగా, అప్పుడప్పుడు స్పష్టంగా "విచిత్రం!" "నిజంగా!" "అమ్మాయీ!" "ఏమండోయ్, మిమ్మల్నే!" అనీ వినబడు తూంటాయి. దేశదేశాల జనం. రకరకాల దుస్తులు. అనేక భాషలు.

పర్వతం దిగువ భాగంలో, కొండట్లో, కొండమీదనున్న వ్యక్తి క్రింద పడవలసిన చోట, ఇద్దరు పోలీసులు నించునివుంటారు, వొక తాడుతో జనాన్ని అరికడుతూ.

కోలాహలం.]

ఒక పోలీసు : ఏయ్, కుర్రాడా, పోతావా, పోవా? పైనించి అతను నీ నెత్తి మీద పడితే మీ అమ్మ బాబూ ఏమంటారు?

కుర్రాడు : అతను యిక్కడ పడతాడాండీ, నిజంగా?

ఒక పోలీసు : ఆ.

కుర్రాడు : సరిగ్గా ఇక్కడే పడతాడా? ఇంకా ముందుకి పడడూ?

ఇంకో పోలీసు : నిజమేనయ్యా! అతను ముందుకి దూకేటప్పుడు ఈ తాడుమీదపడి, చూడ్డానికి వచ్చిన జనాన్ని కూడా చంపుతాడేమో! బరువేమీ తక్కువ వుండడు!

ఒక పోలీసు : ఏయ్, అమ్మాయ్, ఎక్కడికీ? ముందుకి తోసుకుని వొస్తున్నావ్?.. ఏమమ్మా, మీ అమ్మాయేనా? తియ్యవమ్మా ఇక్కణ్ణించీ!... రెండు నిమిషాల్లో అతను కిందపడతాడూ!...

తల్లి : రెండు నిముషాల్లోనే!... అరి భగవంతుడా!...వారింకా రాలేదే, చూడ డానికి!

పిల్ల : అమ్మ, నాన్న కాఫీహోటల్లో వున్నాడే!...

తల్లి : అవునవును! అక్కడేవుంటా రెప్పుడూ! పాపా, నువ్వువెళ్ళి మీనాన్నని పిలుచుకురా!...కాస్సేపట్లో అతను కింద పడతాడు!...ఊఁ. వెళ్ళు...త్వరగా!

[హోటల్లోంచి కేకలు. "రెండు కాఫీ..." "పదణాలన్నరా!" "నాలుగు దోసై, డబుల్ రోస్ట్!"... "హల్లో, కమాన్!"..."టేబిల్ క్లీన్!"..."సెర్వర్! బిల్!"...]

ఒక పోలీసు: ఏయ్, కుర్రాడా! మళ్లీ వొచ్చావూ!

కుర్రాడు: అబ్బే, ఆ బండని అక్కణ్ణించి తీసేద్దామని!

ఒక పోలీసు : ఎందుకూ?

కుర్రాడు: అతను దానిమీద పడితే తల పగిలిపోదూ?

ఇంకో పోలీసు : అది, రైటేనయ్యా! అక్కణ్ణించి కొన్ని రాళ్ళు తీసేసి ఇంకొంచెం చోటు చేద్దాం. ఇక్కడెక్కడా యిసకగానీ, రంపం పొట్టుగానీ లేదూ?

[యిద్దరు యాత్రీకులు వొస్తారు.]

1 వ యాత్రీకుడు : కుర్రాడే!

2 వ యాత్రీ : ఎంత వయసుంటుం దంటారూ?

1 వ యాత్రీ : ఇరవయి ఎనిమిది!

2 వ యాత్రీ: చాల్లెండి! ఇరవయి ఆరు! భయం మూలాన్ని ఎక్కువ వయస్సులా అనిపిస్తోందంతే!

1 వ యాత్రీ : పందెం వేస్తారూ ఎంతెంత పందెం?

2 వ యాత్రీ : పదేసి రూపాయిలు ఖరారేనా? కానియ్యండి!

1 వ యాత్రీ : (పోలీసు వైపు) ఏమండి పోలీసుగారూ! అతనక్కడికి ఎలా వెళ్ళగలిగాడంటారూ? దింపడానికి ఎవరూ ప్రయత్నం చెయ్యరేం?

ఇంకో పోలీసు : చేశారండీ! ఏమీ లాభం లేకపోయింది! మాదగ్గర పెద్ద నిచ్చెనలు లేవాయె!

2 వ యాత్రీ: ఎంతకాలం నించీ అతనక్కడ వున్నాడండీ?

ఇంకో పోలీసు: రెండు రోజులవుతుందండి!

1 వ యాత్రీ : అయితే, ఈ రాత్రి కింపకి రాలిపోతాడు!

2 వ యాత్రీ: చాల్లెండి, ఇరకె రెండ గంటల్లో కిందపడిపోతూంటే!

1 వ యాత్రీ: పందెం వేస్తారూ ఎంతెంత పందెం?

మూలం :
లియొనిడ్ ఆంద్రియేవ్



అనుసరణ :
భాస్కరం, ప్రభాకరం

2 వ యాత్రీ: పదేసి రూపాయలు! ఖరారేనా? కొనెయ్యండి!

[కొండమీంచి ఏదో కేక వినబడుతుంది]

2 వ యాత్రీ:...ఆఁ!...మీకేమన్నా వినబడుతోందా? నాకేమీ వినబడటంల!

1 వ యాత్రీ: నాకూ అంతే!

తల్లి: అయ్యో, ఆయ నింకా రాలేదే!

పిల్ల: ఇప్పుడే వస్తానన్నాడే, నాన్న! కాఫీహోటల్లో ఎవరితోనో మాట్లాడుతున్నాడు.

తల్లి: అయ్యో ఖర్మమా!...పాపా! వెళ్లి మీ నాన్నతో చెప్పవే [illegible]గా రమ్మనీ... అవును గానీ...ఏమం[illegible] పోలీసుగారూ ఇప్పుడే పడిపోతాడంటారా?......పాపా ఎందుకైనా మంచిది, త్వరగా రమ్మన్నావని చెప్పు!

[లావుగా, ఎత్తుగా వున్న వొక స్త్రీ ప్రవేశిస్తుంది. ఆడదయిపోయింది గాని, అంతా మగాడివాటమే! 'పేచీకోరు' అని ఇట్టే తెలిసిపోతుంది. ఆవిడకి సెత్తురు అంటే మహాదాహం! 'దయ, కరుణ' లాంటివి ఆవిడ, పాపం, ఎరగదు! సన్నగా, పీలగా వున్న వొకాయనతో దెబ్బలాడుతూ ప్రవేశిస్తుంది. ఆయన తన చోటులో తను నిలబడే హక్కు కోసం, అన్యాయంగా తన చోటు నాక్రమించిన ఆవిడతో దెబ్బలాడుతూ వుంటాడు, ఇంకేమీ చెయ్యలేక!]

సన్న మనిషి: నేను ఇందాకా గంటనించి నుంచుంటున్నాను! అది నాచోటండీ!...

లావుపాటి ఆవిడ: గంట నువ్వక్కడ వుంటే, ఆచోటు నీదేనంటా వేమిటయ్యోయ్? మంచివాడివే!... నే నిక్కడ నుంచున్నాను!...ఏం చేస్తావ్?...నాకిక్కణ్ణించి బాగా కనబడుతుంది!

సన్నపాయన: నాకూ...అక్కణ్ణించి బాగానే కనబడుతుంది లెండి!

లావు: ఇక్కడనించి మీకేమి చూస్తారు పోగురూ!

సన్నపాయన: మీ కన్న ఎక్కువే చూస్తాను లెండి! "ఏం చూస్తారు?" ట! చూడడానికేముందేమిటి మహా! అతనా కొండమీంచి జారి 'ఢన్' మని కింద పడతాడు. అంతేగా!

లావుపాటి ఆవిడ: మీ కిదే గొప్ప! నే నింతకన్నా వినోదమయినవి చూశాను! అంతెత్తునించి దొమ్మరాట ఆడుతూ దొమ్మరిసాని గడ చివర్నుంచి పడిపోతే, దాని ఎముకలు విరిగిపోయి......తల పగిలిపోయి...నోటిలోంచీ.. ముక్కులోంచీ.. రక్తం...అదేపనిగా కారుతూ వుంటే...

సన్నపాయన: ...అబ్బ...అబ్బ!...



లావుపాటి ఆవిడ: అప్పుడే, 'అబ్బ' అంటారేం? అంతకన్నా గొప్పది,...... సర్కస్‌లో పెద్దపులి నాడించేవాణ్ణి పెద్దపులి తినెయ్యడం!......దగ్గరగా కళ్ళారా చూశాను,...ముందు కుర్చీలో కూర్చుని! జనం అంతా పిరికిపందలు! అదే పరుగెత్తడం!...కాని, ఆ పులి వుంది చూశారూ, మనిషిని మహా వొడుపుగా పడుతుంది! పంజాతో ...ముందు గుండెలమీద కొట్టి - మెడమీద పడి.. గోళ్ళతో పీకి...చీల్చి.. చెండాడి...తుండెతుండేలు గా...

సన్నపాయన: అబ్బబ్బ!...అబ్బబ్బ...చెప్పకండి బాబూ...

లావుపాటి ఆవిడ: ...[illegible] అంతస్తు కడుతూవున్న తాపీమేస్త్రీ పరంజాలమీద నించి కాలుజారి కిందపడి ఆకారం లేకుండ ముద్దయిపోయి అప్పటికప్పుడు చచ్చిపోవడం ఎరుగుదును!...

సన్నపాయన: వొద్దన్నకొద్దీ మరీ చెప్తారండీ మీరు!...మీరు [illegible] చూసినవారల్లే వున్నారు!

లావుపాటి ఆవిడ: [illegible] ప్రమాదం చూశాను!.. .. [illegible]పోయిన జనాన్ని, గాయపడ్డవాళ్లని!...[illegible]!...



# స్వార్థంకోసం



ఏం చెప్పమన్నారూ!......కొంచెం జరగండి. (దబాయిస్తుంది)

[సన్నపాయన మొహం చిట్లించుకుంటాడు. లావుపాటి ఆవిడ తాపీగా కూచుని, బైనాక్యులర్సు తుడుచుకుంటుంది చేతిరుమాలుతో. కళ్ళజోడు ముక్కుమీద సవరించుకుని చాలా నిబ్బరంగా కూర్చుని అటూ ఇటూ చూస్తుంది. 'తల్లి'ని చూస్తుంది!]

లావుపాటి ఆవిడ : కూర్చోవమ్మా, ఎంత సేపు అల్లా నించుంటావు? పాపం!

తల్లి : ఫరవాలేదులెండి! నే నిల్లాగే నిలబడగలను!

లావుపాటి ఆవిడ : ఈ మొగాళ్ళకి బుద్ధి లేదండీ, ఎవరైనా ఆడదొస్తే కాస్త నిలుచుని చోటివ్వరు, సరికదా, తనంతట తను కూర్చుంటే దెబ్బలాడతారు పైపెచ్చు!... మీ రొఖ్ఖరే వొచ్చారా?

తల్లి : ఆయన కాఫీ హొటల్లో వున్నారండీ!

లావుపాటి ఆవిడ : మీ ఆయనకి బుద్ధి లేదండీ!

తల్లి : ఏం? అలా అన్నారు?

లావుపాటి ఆవిడ : అసలు మగాళ్ళకే బుద్ధిలేదు లెండి! కాకపోతే...

పోలీసు : ఇక్కడ చొక్కా పడేసిందెవరు?

కుర్రాడు : నేనేనండీ! అత నా రాయి మీద పడితే దెబ్బ తగలకుండా నేనే...

పోలీసు : అ దక్కణ్ణించి తీసెయ్!

1 వ యాత్రీ : ఇక్కడనించే బాగా కనబడుతోంది!

2 వ యాత్రీ : ఇక్కడనించి అక్కడికన్నా బాగా కనబడుతోంది?

1 వ యాత్రీ : పందెం వేస్తారూ? ఎంతెంత పందెం?

2 వ యాత్రీ : పదేసి రూపాయిలు! ఖరారేనా! కాసెయ్యండి!

(జనంలోంచి)

ఒకడు : ముందు నే నొచ్చాను!

మరొకడు : నీ కన్నా ముందు నే నొచ్చాను!

ఒకడు : నేను నిన్న నే వొచ్చాను!

మరొకడు : నేను మొన్న నే వొచ్చాను!

ఒకడు : వొచ్చినవాడివేం చేస్తున్నావ్, ముందుగా చోటు చూసుకోక!

మరొకడు : నువ్వు చూసుకోలేక పోయావ్, నా చోటులో నించోకపోతే!

ఒకడు : ఇది నీ చోటా?

మరొకడు : కాకపోతే నీ యబ్బదా?

ఒకడు : మాటలు జాగ్రత్తగా రానియ్యవోయ్!...రాలగలవ్?

మరొకడు : ఏమిట్రా పేలుస్తున్నావ్?

ఒకడు : ఏమిట్రా కూస్తున్నావ్?

జనం : ఎందుకు దెబ్బలాట? ఏమిటీ గొడవ? ఫొండి, ఫొండి, ఫొండి.

వ్యాపారస్థుడు : సిసలయిన సరుకండీ, అచ్చం ఏనుగు దంతం దువ్వెన్నలండీ!

1 వ యాత్రీ : అయితే?

వ్యాపా : నమ్మకమైన వస్తువండీ, సరసమైన ధరలండీ!

1 వ యాత్రీ : పోవయ్యా, నాకఖ్ఖర్లేదు అంటూంటే!

వ్యాపా : అయ్యో! పోతానయ్యా! "దువ్వెన్నలూ, రిబ్బన్లూ, బొత్తాములూ" (పోతాడు)

[ఒక ముసలి తాతగారు వొస్తాడు, పిల్లల కోడిలాగ. అందరూ అన్ని వయస్సులూ, పధ్నాలుగేళ్ళ మొదలు ఐదేళ్లవరకూ మనుమలు, మనుమరాళ్ళు.]

తాత : లక్ష్మీ, సీత, శకుంతలా, రామూ, కిష్టిగా, అంతా వున్నారా?... శకుంత లేదర్రా?

లక్ష్మి : ఇక్కడుంది తాతా!

తాత : ఎక్కడ?...శకుంతలా!

శకుంతల : ఆఁ. వున్నాను తాతయ్యా!

తాత : ఎక్కడే? నీ తాడుతెగా! (వెనక్కి తిరిగి) నా వెనకాల వున్నావుటే! ...ఇల్లా ముందు నించోకూడదూ?... వెనక్కి వుంటే నీకేమి కనబడుతుందే? నువ్విక్కడి కెందుకొచ్చావ్?...ఏమి చూడడానికి వొచ్చావ్?

శకుంతల : నాకు తెలియదు తాతా!

తాత : ఓసి వెర్రిపిల్లా, నీకు ఏం చూడాలో తెలియదూ? అటు చూడు! ఆ కొండమీద అతను నీకు కనబడుతున్నాడా?

శకుంతల: ఆ! కనబడుతున్నాడు!

తాత: అల్లాగే చూస్తూవుండు. లక్ష్మి ఇది నిద్దరపోకుండా నువ్వు చూస్తూ వుండు! (కొండపైకి చూసి) పాపం, ఎలా ఎక్కాడో పైకి, పడిపోతాడు కాస్సేపట్లో. పిల్లలూ, చూశారా, ఎంత జాలిగా వున్నాడో! అక్కడి కెక్కితే ప్రమాదం చూశారా?

లక్ష్మి: ఈ వేళ పడడేమో తాతా!

తాత: పడతాడమ్మా, ఈ వేళే పడతాడు!

లక్ష్మి: ఏమో, తాతా, శకుంతల నిద్దరోయింది మళ్లీ. ఏమో, నాకు నిద్దరొస్తోంది. ఎవరో, పడతాడని చెప్పేసరికి నువ్వు నమ్మేస్తావు! నాకు విసుగ్గా వుంది బాబూ!

(కొండమీదకి చూసి) ఆఁ! వణుకుతున్నాడు!

[కొండమీది వ్యక్తి అరుస్తున్నా డేదో పైనుంచి. జనంలో కోలాహలం. బైనాక్యులర్సు పైకి ఎత్తబడతా కెమేరాలన్నీ పైకే వుంటాయి. ఫొటోగ్రాఫర్లు త్వరగా ఏంగిల్సు మార్చుకుంటూ వుంటారు. చాలా తోపిడిగా వుంటుంది. పోలీసులు జనాన్ని ఒక పక్కకి నెట్టేస్తారు. ఒకర్నొకరు తోసుకోడాలు, కలకలం వినబడతాయి]

కొండమీద వ్యక్తి: రక్షించండి బాబోయ్! (అస్పష్టంగా)

తాత: పిల్లలూ, ఇలా రండి! లక్ష్మీ, శకుంతలా, సీతా, రామూ, అంతా. పాపం, ఆ కొండమీద మనిషిని చూడండి! పాపం, కిందపడిపోతాడు కాస్సేపట్లో. ఈ విషాద సంఘటన చూడండి! నిర్మలంగా నీలంగా వున్న ఆకాశం కింద, ఆనందదాయకమైన ఈ ప్రకృతిలో, వున్నతంగా గర్వంగా వున్న ఆ కొండమీద, నిస్సహాయుడై నిలుచున్న ఆ యువకుడు, ఇప్పుడు కిందపడి గాయపడి మరణిస్తాడు! మీకేమన్నా అర్థమవుతోందా, ఈ పరిస్థితి.

పిల్లలు: ఆఁ!

తాత: శకుంతలా, తెలిసిందా. ఆ విశాలమైన నీలాకాశం కింద, ఆ వినిర్మలమై ఆనందమయమైన ప్రకృతిలో...

శకుంతల. తెలుసునయ్యా తాతా! నన్ను చంపకు బాబూ?

వ్యాపారస్థుడు: అసలు సిసలు ఏనుగు దంతం దువ్వెన్నలండీ!

తాత. ఏం? ఎక్కణ్ణించే నా ఎత్తుకొచ్చావా?

వ్యాపారస్థుడు : బాబూగారూ?

తాత : ఎత్తుకు రాకపోతే నీకు ఏనుగు దంతం దువ్వెన్న లెక్కడివిరా? ఫో, ఫో!

వ్యాపార : ఇష్టం వుంటే కొనండి, లేకపోతే మానెయ్యండి, కానీ...బలేవారే... "దువ్వెనలూ, రిబ్బన్లూ, బొత్తాములూ" (వెళ్ళిపోతాడు)

లావుపాటి ఆవిడ : (అనునయంగా) వీళ్ళంతా మీ పిల్లలా తాతగారూ?

తాత : అవునమ్మా, వీళ్ళంతా, నా మనమలూ, మనమరాళ్ళూ. వీళ్ళని తీసుకొచ్చా ఇది చూపిద్దామని!

లావుపాటి ఆవిడ : మంచిపని చేశారు! లేకపోతే వీళ్లకి పిరికితనాలొదిలి గట్టిపడరు! ఇదేమంత గొప్ప! దీని తాతలాంటివి చూశాను! ఫ్యాక్టరీగొట్టం పైకెక్కి కాలుజారి కింద పడిపోతున్న వాణ్ణి మీ రెప్పుడన్నా చూశారూ?......గడ చివర కెళ్ళి ఆడుతున్న దొమ్మరిసాని కిందపడి ఎముకలు

పప్పు పప్పు అయిపోవడం ఎక్కడన్నా చూశారూ?...తప్పించుకు పారిపోడానికి వీలేని సర్కసు బోనులో పెద్దపులి, మనిషిని వశీయం నమిలినట్టు నమిలేస్తూంటే ఎప్పుడన్నా చూశారూ?...

తాత: (ఆశ్చర్యంగా) అరె! అరె! .. వినండర్రా పిల్లలూ, వినండి! అబ్బ మీరెంత అదృష్టవంతులండీ!

['ది ఆంధ్రా హైక్లాస్ బ్యాండు మేళం'వారు యూనిఫారంలో వొస్తారు. అంతా మిలిటరీవాళ్ళలాగ మార్చి చేసుకుంటూ వచ్చి వరుసగా క్రమంలో నుంచుని బ్యాండు వాయిస్తారు "దిగి రమ్మ దిగి రమ్మ, దివినుండి భువికి" అంటూ.]

లక్ష్మి: చూడండి, కొండమీద అతను చేతు లూపుతున్నాడు!

తాత: అదంతా సంగీతం మహత్యమే నంటూరా?

లావుపాటావిడ: ఎందుకు కాకూడదూ, అది సంగీతమే అయితే! కాని వీళ్ల మూలాన అతను పడడం ఆలస్యమవుతుంది. వెళ్ళండయ్యా వెళ్ళండి!

జనం: వెళ్ళండయ్యా! వెళ్ళండి! వెళ్ళండి!

["ది ఆంధ్రా హైక్లాస్ బ్యాండు మేళానికీ జై!" అంటూ బ్యాండు మేళం నిష్క్రమిస్తారు "పోరా బాబూ పో" అని పాడుకుంటూ.]

[తెల్ల షేర్వానీ వేసుకుని, టోపీ పెట్టుకున్న ఒక వ్యక్తి, 'ఘరానా మనిషి', పటాటోపంగా ప్రవేశిస్తాడు!]

టోపీవాలా: ఇది చాలా ఘోరం! ఇంతమంది నుంచున్నారు తీర్థప్రజలాగ! మీ రెవరూ వినలేదూ "రక్షించండి బాబోయ్" అనే ఆర్తనాదం?

జనం: విన్నాం, విన్నాం.

టోపీవాలా: ఆఁ! అదే! నేనూ విన్నాను! "రక్షించండి" అని? మరెవరూ రక్షించరేం? పోలీసులూ! పోలీసులూ! మీరతన్ని రక్షించరేం? మీరేం చేస్తున్నారు?

పోలీసు: అతను కిందపడడానికి వీలుగా చోటు చేస్తున్నామయ్యా.

టోపీవాలా: అది మంచిపనే! కాని, మీరు అతన్ని రక్షించరేమీ అని! మీరు రక్షించి తీరాలి! మానవ సేవావిధి మా ముఖ్యసూత్రం! అందులోనూ "రక్షించండి బాబోయ్" అని అరుస్తున్న వాణ్ణి తప్పకుండా రక్షించాలి! వినుంటారు సోదరులారా?

జనం: అంతే, అంతే. తప్పకుండా రక్షించాలి, తప్పకుండా రక్షించాలి.

టోపీవాలా: మనం నాస్తికులం కాము. మనం భారతీయులం. భగవద్భక్తులం. మన మనస్సులు నిర్మలాలు. మనం పరులను ప్రేమిస్తాం పరులకి ఉపకారం చెయ్యడం కోసమే మనం జీవిస్తాం. ఇది ఆర్షభూమి, బుద్ధునివంటి మహాపురుషులూ, నేతాజీ వంటి వీరాధివీరులూ, గాంధీవంటి మహాత్ములూ జన్మించిన దేశం మన దేశం. మనం దేశానికి సరియైన సక్రమమైన సేవ చెయ్యాలి!...అంతా కలిసి సేవ చెయ్యలేరు కనక నాద్వారా చేస్తున్నా రనుకోండి!...ఇప్పుడు... పోలీసులూ, అతని విషయమై మీరు తగు శ్రద్ధ తీసుకున్నారా.

పోలీసు: ఆ. అన్ని జాగ్రత్తలూ తీసుకున్నాం.

కొండమీద మనిషి: రక్షించండి బాబోయ్!

టోపీవాలా: సోదరులారా, విన్నారా ఆ ఆర్తారావం! విన్నారా ఆ దీనాలాపన! విన్నారా ఆ విషాదగీతం!

జనం: విన్నాం, విన్నాం. అతన్ని రక్షించి తీరాలి.

టోపీవాలా: తప్పకుండా! ఇంతసేపటి నుంచీ నేను చెప్తున్నదదే! విన్నారా పోలీసులూ! ఇది చాలా ఘోరం!

జనం. ఘోరం! ఘోరాతి ఘోరం!

టోపీవాలా: కాబట్టి సోదరులారా! నా మనవి వినండి! ఈ విషయం గురించి మనమంతా కలిసి ఆలోచించాలి. అవునంటారా కాదంటారా?

జనం: అవును. అవును.

టోపీవాలా: సోదరులారా, సోదరీమణులారా. ఈనాడు మనం ఈవిధంగా కలిసి ఆలోచించవలసిన పరిస్థితి ఏర్పడింది మన పౌరుల్లో ఒకడు ఈ ప్రమాదకరమయిన పరిస్థితిలోవుంటే దీనికి కారణం ఏమిటి?..ప్రజలంతా పన్నులు కట్టుకుంటున్నాం. అటువంటప్పుడు ప్రజాభద్రత, ప్రజా సౌఖ్యం, ప్రభుత్వం బాధ్యత అవునా, కాదా? అటువంటి సమయంలో మనం మాట్లాడకుండా వూరుకోవడమేనా? ఆందోళన చేయవద్దా? హక్కులకోసం పోరాడవద్దా?...

ఎలక్షన్లొస్తున్నాయి! నేను మీ తరఫున అభ్యర్థిగా నిలబడదా మనుకుంటున్నాను. దానికి మీ సహకారం ఎంతయినా అవసరం! మీరంతా మీ వోట్లన్నీ నాకే వెయ్యాలి! నన్నే మీ అభ్యర్థిగా ఎన్నుకొమ్మని నా మనవి! ప్రార్థన! వేడికోలు! బోలో స్వతంత్ర భారత కీ...

జనం: జై!.. మా వోటు మీకే! మా వోటు మీకే!

టోపీవాలా: కృతజ్ఞుణ్ణి! సోదరులారా! కృతజ్ఞుణ్ణి!

[కొండమీది మనిషి ఒకమాటు తూగుతాడు! మంచి సస్పెన్సు! ఫొటోగ్రాఫర్ల హడావుడి]

జనం: పడిపోతున్నాడు! పడిపోతున్నాడు!

టోపీవాలా: త్వరపడండి ప్రజలారా! మన కర్తవ్యం ఏమిటో నిర్ణయించుకోవాలి! నాతో ఎవరొస్తారు?

జనం: అంతా వొస్తాం!

[జనం నిష్క్రమిస్తున్న గడబిడ. కాస్సేపటికి జనం దూరంగా కుర్చీలలో కూర్చుని వుంటారు. ఇప్పుడు హోటల్లో సర్వర్ల కేకలు ఆకాశం అంటుతూ వుంటాయి! "ఎనిమిది దోసై, డబుల్ రోస్ట్" "ఆరు చపాతీ" "పన్నెండు కాఫీ స్ప్రింగ్" లాంటి కేకలు ఎన్నో! ఎన్నెన్నో! ఇంతలో కొండమీద మనిషి "ఏయ్, సెర్వర్, ఒక కప్పు కాఫీ అయినా పంపించవయ్యా బాబూ, నోరెండిపోతోంది!" అని గొంతు చించుకుంటాడు.

సెర్వర్ విని, కాస్సేపు స్తంభించి పోతాడు. పైకి చూస్తాడు. మళ్లీ ఏమీ ఎరగనట్టు మామూలుగా పరుగులెడుతూ వుంటాడు]

తల్లి: అరుగో మా ఆయన!

లావుపాటి ఆవిడ: మీ ఆయన మృగం!

'తల్లి': అదేం అల్లా అంటారు?

లావుపాటి ఆవిడ: అసలు మగాళ్లే అంత!

[పత్రికా విలేఖరులు, వారి వెనక చాలామంది జనం ప్రవేశిస్తారు. సెర్వర్లూ వాళ్లూ వినయంగా నవ్వుతూవుంటారు. జనం అందరికీ వీళ్లంటే గౌరవాభిమానాలు]

జనం: పత్రికా విలేఖరులు! పత్రికా విలేఖరులు!

తల్లి: అరి, భగవంతుడా! ఆయ నింకా రాలేదే!

తాత: లక్ష్మి, సీతా, శకుంతలా, అబ్బా

---

కాఫీహోటల్లో పెద్దమనిషి: "ఏయ్, సర్వర్; ఈ ఇడ్లీ ఏమీ బాగులేదు. తీసుకు వెళ్ళిపో"

సర్వర్: "అదేమిటి సార్, అలాగంటారు? మేం కష్టపడి, చెమటోడ్చి, తయారుచేసిన సరుకు బాగాలేదంటారు?"

పెద్దమనిషి: "అందుకే తీసుకుపొమ్మంటున్నాను..."

యిలూ, అంతా చూడండి! వాళ్ళు పత్రికలవాళ్లు! వాళ్ళు ఏది రాస్తే అది నిజమయి పోతూవుంటుంది!

లక్ష్మి : శకుంతలా చూడవే!

['ఐస్ ఫ్రూట్' అని కేక]

శకుంతల : నా కయిస్ ఫ్రూట్ కావాలీ... ఈ...ఈ...

తాత : అబ్బబ్బా! ఇంత గొడవ జరుగుతూవుంటే, చూడక, అయిస్ ఫ్రూటను కుంటావేమ?

1 వ పత్రిక విలేఖరి : ఎక్కడున్నాడు?

జనం : (చాలా మర్యాదగా) అక్కడండి!...ఆపైన...ఇంకా పైనండి...... అక్కడ!...ఆ!...అక్కడ!

2 వ పత్రిక విలేఖరి : అయ్యా, దయయుంచి మమ్మల్ని చూడనివ్వండీ!

ఒకడు : దీనమీద కూర్చోండీ.

3 వ పత్రిక విలేఖరి : (కూర్చుని) థాంక్స్.. (కొండమీదికి చూసి) అతని పరిస్థితి వింతగానే వున్నది (జేబులోంచి నోటుబుక్కు తీస్తూ) మీరు ఫోటోలు తీసుకున్నారా!

1 వ ఫోటోగ్రాఫర్ : ఆ. తీశామండి. ఆ పరిసరాల పరిస్థితీ...

2 వ ఫోటోగ్రా : ఆ దీనుడి ముఖ కవళికలూ. .

1 వ ఫోటోగ్రా : ఆ కొండ క్రింద జనం...

2 వ ఫోటోగ్రా : ఆ జనం ముఖ కవళికలూ ..

1 వ ఫోటోగ్రా : ఆ కొండ...

3 వ పత్రికవి : ఆగండి ! ఆగండి ! చాలా బావుంది! మిగతాది మేం రాసుకోగలం!

తాత : చూశారా పిల్లలూ! ఆ యనే చెపుతున్నారు చాలా బావుందనీ! మీరేమో చూడరు!

3 వ పత్రిక వి॥ : అయ్యా! కాస్త నిశ్శబ్దం!

జనం : సైలెన్స్! సైలెన్స్.

3 వ పత్రిక వి॥ : (కొండమీదనున్న మనిషివైపు చూస్తూ బిగ్గరగా మాట్లాడతాడు) ఏమయ్యా, ఓ కొండమీది మనిషీ, మేము ప్రత్యేక విలేఖరులం. నిన్ను చూడడానికని టాక్సీలో వొచ్చాం. మీ పరిస్థితేమిటో చెప్పమని కోరుతున్నాం. మీ పేరేమిటి? సంఘంలో మీ స్థానం ఏమిటి? అనగా మీరే వృత్తి చేస్తూవుంటారు? మీ వయస్సెంత? (కొండమీద మనిషి ఏదో నసుగుతాడు.) నాకేమీ వినబడటం లేదు! ఇంతసేపటినించీ అత నలాగే వున్నాడా?

జనం : అవునండీ! అలాగే వున్నాడు!

3 వ పత్రిక వి॥ : (రాసుకుంటూ) సరే! మీరు బ్రహ్మచారులా (అరుస్తాడు)... ఆఁ!...వినబడటం లేదు. మీరు బ్రహ్మచారులేనా? (గట్టిగా అరుస్తాడు.)

1 వ యాత్రీ : అవునంటున్నాడండీ !

2 వ యాత్రీ : కాదంటున్నాడండీ!

1 వ యాత్రీ : పందెం వేస్తారూ ? ఎంతెంత పందెం ?

2 వ యాత్రీ: పదేసి రూపాయిలు! ఖరారేనా? కాసెయ్యండి !

3 వ ప. వి : గొడవెందుకు? పెళ్ళయి వట్టే రాశేద్దాం లెండి (రాస్తూ)...వివాహితుడు...(కొండమీదికి చూసి) మీకెంత మంది పిల్లలండీ ?......ఆఁ?...వినబడటం లేదు!...ముగ్గురా ?...ఎందుకైనా మంచిది అయిదుగురని రాసేద్దాం !

తాత: ఎంత దారుణం! పాపం అయిదుగురు పిల్లలతండ్రి!...

లావుపాటి ఆవిడ: అబద్ధాలు!

3 వ పత్రికవి : (అరుస్తాడు) ఎల్లా వెళ్లావయ్యా అక్కడికి ? ఆఁ?...నాకేమీ వినబడకుండా వుంది !...లవుడర్ ప్లీజ్ !... మళ్ళీ చెప్పు !...(జనంతో) మీ కెవరికన్నా వినబడిందా ఆయన మాట?

1 వ యాత్రీ : దారి తప్పిపోయానంటున్నాడండీ!

స్కూలు అధికారులు ఒక రోజున పిల్లలందరినీ, వారివారి కుటుంబాల్లో ఎంతమంది వున్నదీ, తండ్రి వృత్తి, మొదలైన వివరాలు వ్రాయించి మర్నాడు తీసుకు రమ్మని పురమాయించారు. కిష్టప్ప తండ్రి వ్రాసిన కాగితం తీసుకుని మర్నాడు వచ్చాడు:

"మొత్తం నాకు పధ్నాలుగురు పిల్లలు. పొద్దున్నే కాఫీ తాగి, పేపరు చదవడం, సాయంత్రం షికారు వెళ్ళి రావడం నా ఇతర వ్యాపృత్తులు......"

2 వ యాత్రీ: ఎల్లా వెళ్ళాడో తెలియదంటున్నాడండీ!

3 వ యాత్రీ: వేటాడుతూ వెళ్ళి దారి తప్పాడుటండీ!

4 వ యాత్రీ : మొదట సరదాగానే ఎక్కాడుటండీ!

5 వ యాత్రీ: అసలు పిచ్చివాడండీ ! లేకపోతే...

3 వ పత్రికవి : అయ్యా, నిశ్శబ్దం. మేఘాలలోంచి వూడిపడ్డాడని మేమూ అనటంలేదు! అయినా (రాస్తూ) "ఈ దురదృష్ట యువకుడు శైశవంనుంచీ దారిద్ర్యం అనారోగ్య కారణాలవల్ల బాధపడుతూ వొచ్చాడు. ఎల్లా ఎక్కాడో తెలియదు... ఇప్పుడు ఆ పర్వతాగ్రంమీద నిలుచుంటే.. ఆ పున్నమి వెన్నెలలో తళతళలాడే ప్రకృతి సౌందర్యం, ఆ భయదజీమూత పర్వతాల గాంభీర్యం, తన జీవితం తిరిగి పునరావలోకన చేసుకున్నప్పటి హృదయ బాధ, తను వుద్యోగంలో పొందిన నైరాశ్యం, అన్నీ...(రాస్తూంటాడు.)

1 వ యాత్రీ: అవునుగానీ ఈవేళ చవితి గదుటండీ!

2 యాత్రీ: చాల్లెండి. మనవాళ్ళకి తిథుతేం జ్ఞాపకమా, ఏమన్నానా? ఫరవా లేదు!

1 వ యాత్రీ : ఆమాత్రం తెలియదుటండీ ?

2 వ యాత్రీ: తెలుసునని నమ్మకమేమిటి పొండీ!

తాత : చూశారా, పిల్లలూ, ఎల్లాటి

మాటలు సెలవిస్తున్నారో! శివాలమీద చంద్రుడి ప్రభావం చూశారా? పాపం. ఎల్లా వెళ్లాడో కదా ఆ పర్వతంమీదికి!

8 వ పత్రిక వి॥. (అరుస్తాడు) ఏమిటయ్యా? నీ వుూహ తెల్లావున్నాయో. చెప్పవేం? ఇంకా గట్టిగా. అల్లాగ. అ:! . లాభంలేదు ?.

జనం. వినండి, ఏదో అంటున్నాడు

8 వ ప॥ వి॥ (రాస్తూ) మృత్యుభయం అతని అంగాంగంలోను ప్రాకిపోయింది! వెన్నెముకలోంచి భయం జరజర పాకుతూ వుంది నిరాశ పటు నిరాశ మన స్సినీవాలీలో కనబడుతున్నది ఒక చిత్రం తన సహధర్మచారిణి తనకోసం కూరముక్కలు తరుగుతున్నది తన పిల్లలు అనుగో అమాయికంగా ఆనందంతో ఎగురుతూ ఆడుకుంటున్నారు వాళ్లి నాయనమ్మ మట్ట కొలుస్తూ. ఛీఛీ వాళ్ళ తాతయ్య చుట్ట కాలుస్తూ .పిల్లని చూస్తున్నాడు వాళ్లి నాయనమ్మ వొత్తులు చేసుకుంటూ కూర్చుంది పార్వతీదేవికి మల్లే అతను ఈ మాటలన్నీ మా పత్రికలో ప్రకటించాలనే తీవ్ర వాంఛ వెలిబుచ్చాడు!

లావుపాటి ఆవిడ అబద్ధం!

8 వ ప॥ వి॥ (రాస్తూ) ఇంకొక్క నిముషంలో...దానితో, ఇంతవరకూ ఈ ప్రపంచంలో మెలుగుతూ మాట్లాడుతున్న జీవం మరో ప్రపంచానికి పోతుంది!

(కవిత్వం తలకెక్కి కొండమీదికి చూస్తూ) ఓ మరో ప్రపంచానికి మొదటి మెట్టుపై నున్న అభాగ్య జీవీ, నీ అంతిమ సందేశం ఇవ్వవా సోదరమానవులకి!

కొండమీదమనిషి (ఈమాటు మాటస్పష్టంగా వినబడుతుంది) అందర్నీ చావమను!

8 వ ప॥ వి॥ అల్లాగా? సరే "సోదరమానవులకి విప్లవాభివందనలు మీ లోకుల మతభేదాలు నశించాలి .పరస్పర సహకారంతో బతకాలి" ప్రజలంతా కన్నీటిలో మునిగిపోయారు!

లావుపాటి ఆవిడ అబద్ధం!..

కొండమీద మనిషి మీరంతా లేవక పోతే, మీ నెత్తిమీద పడతాను! నూట డబ్బయ్ పౌనులకి తక్కువ లేను!

(జనంలో కలకలం "పడుతున్నాడు! పడుతున్నాడు!" సస్పెన్స హఠాత్తుగా కొండమీది మనిషి పడిపోడు)

1 వ ఫొటోగ్రాఫర్ అరె! రీలయిపోయిందే!

["ఫొటోరీల్సు! సూపర్ డబ్లెక్స్, వెరిక్రోమ్, కొడక్ కంపెనీవి" అని మద్రవాడు కేకవేస్తాడు]

1 వ ఫొటోగ్రాఫర్ ఏయ్! మద్రాడా! వొక సిక్స్ ట్వెంటీ కొడక్ సూపర్ డబ్లెక్సు ఇల్లా ఇయ్యి!

(కెమెరా లోడ్ చేస్తాడు)

[కొంతమంది జనాన్ని వెంటతీసుకుని, ఒక ఎత్తయిన మనిషి ప్రవేశిస్తాడు, వేస్టుకోటు, చేతిలో తుపాకి]

వేస్టుకోటు (అరుస్తాడు) ఇంతసేపటి నుంచీ జనాన్ని యిక్కడ నించోపెట్టావుగదా, నీకోసం ఇంతమంది జనం కని పెట్టుకు కూర్చున్నారనే జ్ఞానం నీ కుందిటయ్యా? మర్యాదగా దిగుతావా లేకపోతే షూట్ చెయ్యమన్నావా?

సన్నపాయన మీకేమన్నా మతిపోయిందేమిటండీ!

వేస్టుకోటు మీరూరుకోండి! (అరుస్తాడు)

కొండమీద మనిషి ఏయ్ పోలీసూ, షూట్ చేస్తానని అరుస్తున్నాడు, వీణ్ణిలాగెయ్యి ప్రొప్రయిటరుగార్ని ఇలా పిలు, ఇక చాలు వుద్యోగం.

జనం: అదేమిటి? ప్రొప్రయిటరేమిటి? సంధి పేలాపన! సంధి మాటలు!

కొండమీద మనిషి నానడుం నెప్పెడుతోందయ్యోయ్!

తల్లి కాళ్ళూ, చేతులూ ఎలా విసురుకుంటున్నాడో పాపం!

తాత మరణవేదనమ్మా, పాపం, మరణవేదన పడుతున్నాడు!

వేస్టుకోటు చావడానికి సిద్ధంగా వుండి, నడుం నెప్పి అని ఏడుస్తావేమయ్యా?

కొండమీద మనిషి చావడానికి సిద్ధంగా నువ్వున్నావు కాబోలు! నేను లేను!

[జనంలో ప్రళయకోలాహలం "తన్ను, కొట్టు" లాంటివి వినబడుతూ వుంటాయి లుంగీపంచా, తెల్లచొక్కాతో వున్న ఆ వ్యక్తిని పట్టుకుని కొందరు లాక్కొస్తారు ఆయన అందరికీ నమస్కారాలు పెడుతూ వుంటాడు నెర్వస్‌గా నవ్వుతూవుంటాడు]

జనం: దొంగ! ద్రోహి! మోసం! కుట్ర! అన్యాయం! అక్రమం!

జనం ఏమిటి సంగతి?... ఎవరు దొంగ? ఏమి కుట్ర?

ప్రొప్రయిటర్. ఏమీ లేదండీ అంతా వేళాకోళం నిజంగా వరదాకి! నన్ను నమ్మండి! మా హోటలు కొచ్చే జనానికి మంచి వినోదం లేదని!.

కొండమీది మనిషి ప్రొప్రయిటరు గారూ!

ప్రొప్రయిటర్ ఉండవయ్యా,వొక్క క్షణం!. వినోదం మంచిది లేదని

కొండమీద మనిషి ఏమయ్యోయ్, ఇక్కడ నేను ఎంతసేపుండాలి? మూడు గంటలకల్లా దింపేస్తానన్నావ్ ? ఇప్పుడెంతయిందో చూశావా?

# ★ స్వార్థంకోసం ★

వేస్టుకోటు విన్నారా, సోదరులారా! ఈ ద్రోహం! ఈ మోసం! ఈ దగాకోరు ఆ దగాకోరుని కూలికి కొండమీద నిలబెట్టి కట్టి మన

జనం: కట్టాడా? కట్టాడా? నిజంగా నే?

వేస్టుకోటు అవును సోదరులారా! అతన్ని తాడుతో కట్టేశాడు మనంమాత్రం ఇంతమందీ ఆ వ్యక్తికోసం ఆరాటపడుతున్నాం ఎప్పుడు కిందపడిపోతాడో, అని!

కొండమీద మనిషి పడినా బాగుండును! ఎందు కొచ్చిన బతుకు? ఏదో పదిహేనురూపాయిలన్నర ఇస్తాను, మూడు గంట లయ్యేవరకూ ఆ కొండమీదనించి వెళ్లొడుతూ వుండూ, అంటే వొప్పు కున్నాను గానీ

ఏమయ్యోయ్, ప్రొప్రయిటరూ, అయిన ఆలస్యం చాలు. ఇంకాస్సేపుంటే ఆ తిక్కవాడు నిజంగా పేల్చి చంపుతాడు, దింపవయ్యా బాబూ, నీపుణ్యాం వుంటుంది!

లక్ష్మి తాతయ్యా ఎవరేది చెపితే అది నమ్ముతాడు మనల్ని చంపుకుతిన్నాడు

ప్రొప్రయిటరు ఇక్కడ జనానికి విసుగెత్తిపోతోందని కొస్త వినోదానికి పురజనుల వినోదానికి

లావుపాటి ఆవిడ అదేమిటి? నా కర్థం గావటంలేదు? అతను ఎందుకు పడడు? అతను పడటంలేదూ? అతను పడకపోతే ఇంకెవరు పడతారు?

సన్నపాయన నాకుమాత్రం తెలిసి చచ్చిందా? న్యాయానికి అతనే పడాలి!

లక్ష్మి నీమూలాన్నే తాతా! ఎవడో పడిపోతున్నాడని ఎవడో చెపితే నమ్మి తీసుకొచ్చావ్! ఏమీ లేదు!

కకుం నాకు నిద్దరొస్తూంది! నా నిద్దరంతా చెడగొట్టేశావ్!

తాత వుండండే బాబూ!

ప్రొప్రయిటరు ఎప్పుడూ గ్రామఫోను రికార్డులే పెడితే పాటలు కొచ్చే జనానికి విసుగుగా వుందని ఒక పాటలు ప్రొప్రయిటరు తన యజమానుల వినోదార్థం ఏదన్నా కొత్తరకాలకి పని కల్పించే వినోదం ఏర్పాటుచేస్తే

8వ ప॥ వి॥ ఈ పాటలు నీదేనా?

ప్రొప్రయిటరు చిత్తం!

8వ ప॥ వి॥ ఈ సరుకు లమ్మేవాళ్లు నీ విజంట్లేనా?

ప్రొప్రయిటరు చిత్తం!

విలేఖరి ఐస్‌ఫ్రూట్ కూడానా?

ప్రొప్రయిటరు చిత్తం!

విలేఖరి ఫొటోరీల్సు కూడా?

ప్రొప్రయిటరు చిత్తం!

విలేఖరి (రాస్తూ) ఒక సవరణ ఇంతవరకూ రాసినది సరిఅయినది కాదనటానికి విచారిస్తున్నాం ఒక మోసకారైన పాటలు వ్యాపారస్తుడు తన వస్తువులన్నీ విరివిగా అమ్ముడయి పోవడం కోసం స్వార్థంకోసం పన్నిన పన్నాగం

కొండమీద మనిషి ఏమయ్యోయ్! నన్ను దింపుతావా లేదా? బాగానే వుంది!

ప్రొప్రయిటరు. (కోపంగా) ఏమిటోయ్, నీ గొడవ? రోజూ రాత్రి దింపుతున్నామూ, అల్లానే వుంచేస్తున్నామా? అన్నా! వూరుకున్నకొద్దీ మరీనూ ఆ!.

కొండమీది మనిషి రాత్రికూడా దింపకుండా వుండాలీ? ఇంకా నయం!

ప్రొప్రయిటరు కొంచెంసేపు ఆగ[illegible] టయ్యా? అసలే వీరంతా విసుక్కుంట లేనూ? నాకు నక్కచావొచ్చిందయ

వేస్టుకోటు నక్క చావు రాదు స్వార్థంకోసం నువ్వొక్ని నక్క జిత్తు పన్నేవ్! ఒక్క ప్రాణికోసం జనమం ఆశతో ఆవేశంతో [illegible] ఉత్కం తతో కింద కాచుకొనివుంటే, ఆ [illegible] కాశం పురస్కరించుకుని నువ్వు నీ స్వార్థ కోసం వ్యాపారం సాగించుకుం న్నావా? నీ వ్యాపారాభివృద్ధికో[illegible] వాడిని కొండమీద కట్టేశావా? వా[illegible] పడతాడు కదా అని జనం ఆశతో ఎదు[illegible] చూస్తున్నారు! వాడికి బతకాలని వు[illegible] సరే, జనంకోసం వాడు పడితీరాలి!

లావుపాటి ఆవిడ పడి తీరాలి! నొప్పుకోను లేకపోతే! నేను ఆరోప[illegible]

(56—వ పేజీ చూడండి)

ఒక నిరుపేద యెన్నిప్రయత్నాలు చేసినా ఒకటి రెండు మాసాలు టెంపరరీ వుద్యోగం తప్ప స్థిరమైన వుద్యోగం కుదర లేదు. ప్రయత్నం చెయ్యగా, చెయ్యగా ఒక గాజు సామాను అమ్మే కంపెనీలో వుద్యోగానికి కుదిరేడు. ఒకనాడు అతడు ఒక గాజు సామాను పెట్టె గదిలో నుండి తెస్తుండగా చేయి జారి పడిపోయింది. వెంటనే ఆయజమాని యిల్లా కేకలేసేడు "ఆ పెట్టె విలువ రు 200/- నెలకు రు 5/- చొ॥ నీ జీతంలో నుండి మినహాయిస్తూవుంటాం! తెలుసా?" అనేసరికి అతడు "చిత్తం" అంటూ బైటకువచ్చి, 'అమ్మయ్య! యిన్నాళ్ళకు నలభైమాసాలు గ్యారంటీ గల వుద్యోగం దొరికింద'ని సంతోషిస్తూ యింటిదారి పట్టేడు!!

– వెల్నా వెంకటరాజు, సాలూరు

"ఈ వేళ సుశీల ఎంత కమ్మగా పాడిందనుకున్నావ్! కడుపులో ఆకలవుతున్నా కదలిరాలేకపోయాను"

రాత్రి తొమ్మిదింటికి ఇంటికి వచ్చిన సత్యనారాయణ, కోటు విప్పి, పాగా కర్రకు తగిలిస్తూ అన్నాడు

"మీ భానుకన్న కమ్మగా పాడిందా ఏమిటి?" కాళ్ళు కడుక్కోనేందుకు చెంబుతో నీళ్ళందిచ్చి, చిత్రంగా అతని వైపు చూస్తూ అన్నది

సత్యనారాయణ విద్యుద్ఘాతం తిన్నవాడిలా నిలబడిపోయాడు ఒక్కక్షణంలో తేరుకొని ఆమెవైపు చూసి, తల దించేసుకుని, కాళ్ళు కడుక్కోసాగాడు అతని చూపులో ఏ భావమూ లేకపోయినా, "నువ్వనేదేమిటి?" అన్న ప్రశ్న ఆమెకు అందకపోలేదు

సత్యనారాయణ దీర్ఘ నిశ్వాసం వదలి, వండెంమీద లాల్చీ తీసి తువాలనుకొని ఒత్తుకోసాగాడు

"అంత తన్మయత్వమా? ఆ లాల్చీ అసలే మాసి మట్టిలా తయారయింది చాకలిరావటం మానేసి, తువాలిదిగో" అని, నవ్వుతూ .. ఒక్కక్షణం ఆగి,

"అయినా ఇంతకీ మిమ్మల్ని ప్రయోజనమేమిటి? నా కర్మ" - అని, కొంగు చెంగు వేలికి మెలిద్రిప్పుకుంటూ, వంటింట్లోకి నడిచింది

సత్యనారాయణ పంట్లాం తీసేసి, లుంగీ చుట్టబెట్టుకొని, దొడ్డివాకిట్లో మడతమంచం మీద కూర్చుని, ఆమె పిలుపుకోసం నిరీక్షిస్తున్నాడు

అతని మనస్సుమాత్రం తన భార్య అమాయకత్వం వైపూ, అనుమానంతో తనను బాధించటం వైపూ మరలింది

"వడ్డించేశాను వస్తారా? ఇంకా " అని, ఆగింది.

"వస్తున్నా" అంటూ, బరువుగానే అడుగులు కదిపాడు ఆలోచిస్తూనే అతను అన్నం కలపసాగాడు వాస్తవానికి తాను 'భాను'ని ప్రేమించాడు భాను తననూ ప్రేమించింది కాని తమ వివాహం ఎపుడు కాదని తెలిసిందో, అప్పట్నుంచీ ఆమెను మరచిపోవటానికే యత్నిస్తున్నాడు. పరాకునైనా 'భాను' విషయమై తన భార్యతో ప్రస్తావించటం లేదు అయినా ఆమె తనను విశ్వసించటం లేదు

ఆ ఆలోచనలో, ఆమె నెయ్యి వడ్డిస్తూంటే 'చాలు' అనటం మరచిపోయాడు అతను నెయ్యి తక్కువ వేసుకుంటాడని తెలిసి కూడా ఆమె గిన్నె వొంచుతూ,

"మీరు ఏదో ఆలోచిస్తున్నట్టున్నారు మళ్ళీ రేపు నెయ్యి తెమ్మంటే-'తాగేస్తున్నావా'- అంటారు" అని, గిన్నె ఎత్తిపట్టుకుంది అప్పటికే పురిషిడు నిండిపోయింది

"నేను నెయ్యి ఎంత వేసుకుంటానో నీకు తెలీదూ?" అని, ఆమెవైపు సాదుగానే చూచాడు

## ఉపశ్రీ

"తెలుసు కాని 'సంపాయించి తెచ్చేవాణ్ణి నేనుండగా వడ్డించటానికి నీకేం బాధ' అని దెప్పి పొడుస్తారనీ తెలుసు" అన్నది, నడుస్తూ వెనుదిగిరి చూసి

"ఈ మాటలు ఎవరేనా వింటే ఏమను కుంటారు?"

"వాళ్ళింట్లోలానే మన యింట్లో కూడా భర్తకు భార్యమీద అధార్టీ చెలాయించటం తెలుసుననుకుంటారే గాని, 'భాను' పేరు మీకు తన్మయత్వం కలిగిస్తుందనుకోరుగా!" కన్నీరు పైట చెంగుతో ఒత్తుకుంటూ అన్నది

"నిన్ను నేను ఏం బాధిస్తున్నానని నువ్వు నన్నుయిలా వేధిస్తున్నావ్?"

తల పైకెత్తి అడిగాడు

"ఉదయం తొమ్మిదింటికి గడప దాటిన కాలు రాత్రి తొమ్మిది గంటలవరకూ ఈ గడప తొక్కదు అంతవరకూ ఈ ఇంట్లో నేను ఒక్కర్తెనూ ముక్కి, మూలుగుతూ వుండాలి గడపలో కాలెడుతూనే, నా యోగక్షేమాలకంటె, నన్ను మభ్యపెట్టటం కోసం సుశీల కమ్మగా పాడిందనీ, సరళ అద్భుతంగా ఆడిందనీ, ప్రమీల ప్రమోదకరంగా ప్రసంగించిందనీ, భాను భరతనాట్యం అయినా నాకెందుకు లెండి మిమ్మల్ని ఏం ప్రయోజనం? నా కర్మ" అని, కన్నీరు వత్తుకుంది

"ఇంతకీ ఈపూట రెండు మెతుకులు తిననిస్తావా?"

"మీరలా అంటారని నాకు తెలుసు; కాని సాయంకాలం నాలుగింటికి కాలేజీ వదిలితే, రాత్రిపదింటివరకూ మీకు ఇంటికి రావటానికి తీరిక ఉండదు బిక్కు బిక్కుమంటూ ఈ కొంపలో ఒక్కదాన్నీ గోళ్ళు గిల్లుకుంటూ ఎలా బ్రతకగలనో మాత్రం మీరు ఒక్కనాడూ తెలిసికోనేందుకు ప్రయత్నించరు"

పళ్ళెంలో కూర ముక్కలు వడ్డిస్తూ, నిలబడి అన్నది.

"ఈ కంఠం ముడి కాస్తా ఆ కత్తిపీటతో తప్పిస్తావ్?"

"అవేం మాటలండీ, ఎప్పుడో ఆ శాకే వేసేస్తే తీరిపోతుందిగా"

"నిజంగా, నువ్వు నన్ను తినేస్తున్నావుమీ! ఛీ! ఆడజాతికి విశ్వాసం లేదు

(56-వ పేజీ చూడండి)

# పెళ్లి భయం

పోతుకూచి

సాంబశివరావు

వయసు వచ్చిన ప్రతీవాడినీ అడిగే విధంగానే నన్నూ అడిగారు మా వాళ్ళు పెళ్ళిచేసుకోమని కాని నాకు మనస్కరించలేదు స్త్రీ సాహచర్యంతో జీవితాన్ని ముడిపెట్టుకుంటే మగవానికి భవిష్యత్తు లేదని నా అభిప్రాయం. ఈ అభిప్రాయం స్థిరపడడానికి నా చుట్టూ ఉన్న వాతావరణం చాలావరకు హేతువంటే అది అబద్ధం కాదు.

మా పెత్తండ్రిగారింట్లో పెండ్లి చూసి, మా దీక్షితులు బాబాయి కుటుంబంతో తిరిగి యింటికి వచ్చేస్తున్నాను అప్పుడు నాకు పన్నెండు సంవత్సరాలు అన్నగారిదగ్గర చాలా కాలం నుంచి ఉంటున్న ముసలితల్లి పెళ్ళికి రాగా, కొన్నాళ్ళు తన దగ్గరకూడా ఉండమని, తల్లిని వెంటబెట్టుకుని మా బాబాయి బయలుదేరాడు. బయలుదేరేముందు మా పిన్ని సణుగుడు మొదలుపెట్టింది "ఉన్న పిల్లలకే చాకిరీ చెయ్యలేక చస్తూంటే, యీ ముసలి పీనుగులుకూడా నా నెత్తిన ఎందుకు?" అని పెళ్ళము మాటలకు అసలు లోపల భయపడుతున్నా, చాలాకాలం నుంచి తల్లి దూరంగా ఉండడంవల్ల, మాతృప్రేమ కరిగి, భార్యను లెక్క చేయకుండా తల్లిని బండి ఎక్కించాడు బాబాయి మా ముసలిబామ్మ కోడలు గయ్యాళి అని తెలిసికూడ, చిన్న కొడుకుదగ్గర కొన్నాళ్లు ఉండాలనే కోరికతో "ఎందుకు, ఎందుకు" అంటూనే బండి ఎక్కింది.

రెండెడ్లబండి గతుకుల రోడ్డుపై నడుస్తూనే వుంది మా పిన్ని అత్తగారిమీద తిట్లు విసరడం ప్రారంభించింది మా ముసలిబామ్మ వినీ విననట్లు మాట్లాడకుండా ఊరుకుంది తల్లిని పదే పదే తిడుతూంటే, బాబాయి ఊరుకోలేక మా పిన్నిని కూకలేశాడు 'ఏడాదిక ఒక్కసారైనా తల్లికి సేవచేయలేనప్పుడు - మీరంతా ఉండి చచ్చినా బ్రతికినా ఒకటే" అంటూ భయం కోపం మిళితమైన కంఠంతో అరిచాడు మా పిన్ని ఆ కేకలకు చిలవలు పలవలు తగిలించి మా బామ్మని తిట్టింది పిల్లలిని కొట్టింది

ఈ పరిస్థితిలో బండి గమ్యస్థానం చేరింది కృష్ణానదిపాయ ఒకటి అడ్డుగా నిలిచింది అది దాటితే మావూరు బండి దిగి యిసుకరేవు చేరాము నది దాటించే పడవవాడు సిద్ధంగా ఉన్నాడు నడుస్తూ నడుస్తూ మా పిన్ని హఠాత్తుగా ఆనది యిసుక తిన్నెలో చతికిలపడి యింటికి రాకుండా ఆ కృష్ణానదిలో పడి చచ్చిపోతానంది తను యింటికి రావాలంటే, అత్తగారిని తిరిగి పంపివేయమంది పిన్ని గోలచూసి, మా బాబాయికి నిజంగా కోపం వచ్చింది భయపడుతూనే కొట్టాడు ఇంకేముంది? మా పిన్ని రెచ్చిపోయింది శివంగిలా జుట్టు విరబోసుకుని కేకలతో తిట్లతో గంతులేయసాగింది నదిలోకి గబగబా నడిచింది చచ్చిపోతానంటూ మా బాబాయి ఆమె వెనకాల పరుగెత్తాడు ఆమెను పట్టుకోవడం సాధ్యం కాలేదు ఈ ఆపద చూసి పడవవాడు నదిలోకి పరుగెత్తి ఆమెను బలవంతాన రెక్క పట్టుకు లాక్కొచ్చి పడవలో కుదేశాడు "నన్నెందుకు ముట్టుకుంటావురా దొంగముండాకొడకా" అంటూ గలభా చేసింది మా పిన్ని. మా బాబయ్యకు యీ దృశ్యం యిష్టం లేకపోయినా, తప్పని సరి అయింది. పడవ నడిచింది మా పిన్ని గోల మానలేదు నదిమధ్యలో, గాలి జోరులో, పడవ కుదుపులో, నదిలో పడి చచ్చిపోతానంటూ పడవ అంచులమీది నుంచి దుముకబోయింది ఒక్క పట్టు తప్పితే అందరం ఆ నదగర్భంలో ఉండవలసిన వాళ్ళం నా గుండె బిటుకుబిటుకుమంది ఒళ్ళంతా ముచ్చెమటలు పోశాయి 'బాబోయ్' అన్నా పడవవాడు చేతిలోని గెడకర్రతో మా పిన్ని నెత్తిమీద బలంగా ఒకటి కొట్టాడు ఆమె స్పృహతప్పి పడిపోయింది అప్పటికి మా కొక గండం తప్పింది

ఆ దృశ్యం యిప్పటికీ నాకు మరుపురాదు ఆ స్త్రీ గయ్యాళితనం మొదటసారి నా హృదయంలో నాటుకుని ఆడజాతి అంతా యింతే అనే అభిప్రాయం నాలో కలిగించింది కాని మా బాబాయి అంటాడు "అది మంచిదేరా అప్పుడప్పుడు పిచ్చి కోపం వస్తుంది గాని" అని ఆమె మంచితనమేమిటో నాకుమాత్రం అర్థం కాలేదు

సెలవలకు ఒకసారి మా బావగారి ఊరు వెళ్ళాను అప్పటికి నాకు పదునాలుగేండ్లు వయస్సుకుమించి పెరిగాను అందరూ నాకు పద్దెనిమిది సంవత్సరాలనుకునేవారు అలాగే మా బావగారి యింటివారు కూడా నన్ను పెద్దమనిషిగా జమకట్టారు మా బావగారింట్లో నూతిదగ్గర స్నానం చేసేవాడిని ఆ యింటివారి కోడలు మంగళ ప్రొద్దున పాచి చేస్తూ కనిపిస్తూ ఉండేది అందంగా ఉబికిన ఆ సిగ్గుబుగ్గలు రేగిన ముంగురులు, కుందని బంగారు ముఖం, తల వంచుకుని నడిచే ఆ మందగమనం, నన్ను ముగ్ధుణ్ణి చేశాయి నిజంగా అనుకునేవాడిని, అటువంటి భార్య లభించినవాడు అదృష్టవంతుడని నూతిదగ్గర నేను స్నానం చేస్తూంటే పది గజాలు గబగబ తల వంచుకుని నడిచి పారిపోయేది నాకే చాలా సిగ్గు కలిగేది అటువంటి పరస్త్రీని అనవసరంగా చూస్తున్నందుకు చాలా అందమైన అనుకూలమైన గృహిణి అని ఆమెను చూచినవారందరూ అనేవారు

ఇదే భావం కలిగిన నాకు ఒక నెల తర్వాత విన్న వార్త చాలా ఆశ్చర్యం కలిగించింది - ప్రక్కనే కాపురముంటున్న ఒక రెడ్డితో ఆమె లేచిపోయిందని ఆమెను వెతికి పట్టుకున్నాక, భర్త, తలిదండ్రులు ఆమెను సవ్యంగావచ్చి తిరిగి కాపురం చేసుకోమన్నా 'ససేమిరా' అని ఆ రెడ్డిని వదలక, భీష్మించుకుందని తెలిసింది అప్పుడే కలిగింది నాకు ఆడది వంచకురాలు అనే అభిప్రాయం

అవి నేను కాలేజీలో అడుగు పెట్టిన రోజులు గోపాలానికి నాకు చాలా స్నేహం కుదిరింది అతను నాటకాలు బాగా వేస్తాడు బహుమ




"పెళ్లి చేసుకోనని ప్రతినపట్టిన భీష్ముడులెండి మా వాడు.' అంటూ ఎగతాళిచేసింది మా వదినె.

తులు పొందాడు గానీ నాటకాలు వేయాలని కుతూహలం ఎక్కువగా ఉండేది. అదే వాళ్ళిద్దరికీ స్నేహం కుదర్చి చాలా సన్నిహితంగా తీసుకువచ్చింది. గోపాలాన్ని అందరూ సగౌరవంగా అభిమానంతో చూసేవారు.

అతనికి ఒక అమ్మాయితో సాంగత్యం కలిగింది. ఆమె పేరు లలిత. ఆమె గోపాలం యింటిప్రక్కనే అద్దెకు వుంది. అతని నటనాకౌశలాన్ని ఆమె ఎంతో మెచ్చుకునేది. తరుచు వారిద్దరూ ఏదో విషయంపై కలుసుకునేవారు.

గోపాలం అన్నాడు ఒకసారి నాతో ఆమెతన్ని ప్రేమిస్తున్నదని. ఆమె సాంగత్యం నిజంగా అతనికి సంతోషకరంగా ఉండేది. కారణం లలిత అందకత్తే కాక డబ్బుకలది కూడ. కావలసిన డబ్బు తండ్రిదగ్గరనుంచి తనకై తెప్పించుకుని గోపాలానికి యిచ్చేది. ప్రేమ, ధనం, అందం, అన్నీ కలిసి వచ్చిన ఆ స్త్రీని విడిచే బుద్ధి పుట్టలేదు గోపాలానికి. పెళ్ళి చేసుకోనున్నాడు. ఆమె ఒప్పుకుంది కూడా. వారిద్దరూ ఆనందంగా చాలా రోజులు గడిపేశారు. ఆ దినాలు నాకు బాగా తెలుసు. ఒక్కరోజు ఆమెను చూడకుండా ఉండలేకపోయేవాడు గోపాలం. ఒకవేళ ఆమె కనిపించకపోతే మతిపోయినట్లు ప్రవర్తించేవాడు. యిద్దరూ పరీక్ష తప్పారు. వేసంగి సెలవులకు ఆమె తనవూరు వెళ్ళిపోయింది.

లలిత లేనిదే గడపటం కష్టమనిపించింది గోపాలానికి. పిచ్చివాడిలా గెడ్డం పెంచాడు. కొన్నాళ్ళు ఆమెదగ్గరనుంచి కొన్నాళ్ళు ఉత్తరాలువచ్చి తరువాత ఆగిపోయాయి. తిరిగి కలుసుకోవాలని లలిత వూరు వెళ్ళాడు గోపాలం. ఆమె తండ్రిని కలుసుకున్నాడు. లలిత నాతనికిచ్చి పెండ్లి చెయ్యమన్నాడు. ఆమె తండ్రి వినలేదు. లలితను ప్రశ్నించాడు గోపాలం, గడచిన దినాలు జ్ఞప్తికి తెచ్చి. ఆమె ఎందుకో మౌనం వహించింది. గోపాలానికి అది అర్థంకాలేదు. ఆమె తండ్రి యితనిని పరిహసించాడు "ఏం చూసి పిల్లనిస్తాన్నావు? డబ్బా? చదువా? అందమా?" ఆ ప్రశ్న బాణంలా గ్రుచ్చుకుంది గోపాలం మనస్సులో. నిజం అతనిలో ఆ మూడూ లేవు. ఖిన్నుడై యింటికి తిరిగి వచ్చాడు. మతి పూర్తిగా చెడింది. తర్వాత పిచ్చాసుపత్రిలో అతనిని చేర్చారు. ఆ మిత్రుని అవస్థ చూసేసరికి నా బాధ కట్టలు తెంచుకుని ప్రవహించింది.

నాకు స్త్రీ గురించి మనువు కలిగిన అభిప్రాయాన్ని యీఘట్టము బాగా

బలపరిచింది ఆడది రాక్షసి. మగవాడిని తన విలాసం ఆనందంకోసం ఆటబొమ్మను చేసి, ఆడించి, లాలించి, తన సరదాలు తీరాక, అతనిని గడ్డిపరకగా చూస్తుంది.

తరువాత నాకు తెలిసింది, లలిత ఒక యింజనీరును పెళ్ళి చేసుకున్నట్లు ఎప్పుడో ప్రయాణం చేస్తూంటే ఒకసారి రైల్లో కనిపించింది నన్ను పలకరించి తన భర్తను పరిచయం చేసింది కొన్నేపయినాక మెల్లిగా అడిగింది గోపాలం ఎక్కడ? ఏం చేస్తున్నాడు? అని. చెప్పాను 'నీపేరు స్మరించుకుంటూ పిచ్చిఆసుపత్రిలో ఉన్నాడని' ఆమె కళ్ళల్లో నీరు ఉబికింది కాని దిగమింగుకుంది మరుక్షణంలో ఆమె భావం ఏమిటో నాకు అర్థం కాలేదు అడుగుదామనుకుంటే అవకాశం లేకపోయింది

స్త్రీపట్ల అటువంటి అసహ్యం నాలో పునాదులు వేసుకున్నప్పుడు, నాకు వయసు రావడం, నా పెళ్ళిసంగతి కదపడం జరిగింది. అందువల్ల పెళ్ళి అంటే నాకు చెప్పరాని బాధ కలిగింది

చిన్నప్పుడు తండ్రి చనిపోతే అప్పటినుంచి మా అన్నయ్య నన్ను పెంచి పెద్ద చేసి చదువు చెప్పించాడు అందుచేత నేను సమాధానం యిచ్చాను 'నేను సస్వతంత్రుణ్ణి. డబ్బు లేదు. కనుక భార్యను పోషించలేను. అందుచేత పెళ్ళివద్దు' అని ఈ కారణం మా వాళ్ళకు సబబుగా కనిపించలేదు 'డబ్బు లేకపోతే సంపాదించుకోడానికి చాలా జీవితం ముందుంది కాని యౌవనం జారిపోతే తిరిగి సంపాదించుకోలేవు' అని నీతి బోధించారు! అది నా చెవికెక్కలేదు

అయినా చదువు పూర్తికావాలని మరో సాకు అడ్డువేశాను చదువయినాక ఉద్యోగం దొరకాలని మరో వంక బెట్టాను ఉద్యోగం దొరికాక, యింట్లో ఎదిగి ఉన్న మా రెండో చెల్లెలి పెండ్లి ముందు కావాలి అని మరో మిష బెట్టాను నా చెల్లెలి పెళ్ళి కూడా అయిపోయింది నాకు యింకే వంక దొరకలేదు తప్పనిసరిగా సంబంధాలు చూస్తూ ఏదీ నచ్చలేదనేవాణ్ణి మా వాళ్ళకు నా తత్వం అర్థం కాలేదు నేను ఎందుకు పెళ్ళి చేసుకోనన్న అనుమానమే వారిని పీడించింది కాని నేను మాత్రం, పెరిగిన స్త్రీద్వేషంతో, మనోనిగ్రహంతో, పాతిక సంవత్సరాల వయసుదాకా రోజులు దొర్లించాను

మా అన్నయ్య చెబితే ఒకరోజు మా వదినెను సాయంగా వెళ్ళాను సినీమాకు. విశ్రాంతి సమయంలో లైట్లు వెలిగాయి

"లక్ష్మీ! లక్ష్మీ!"

వెనకనుంచి కేక వినబడింది మా వదినె వెనక్కి తిరిగి చూసింది నేనూ చూశాను

నీలిరంగు సిల్కుచీర ఆకుపచ్చ సిల్కు జాకట్టు - తాంబూలంతో ఎర్రబడిన పెదాలు గండుతుమ్మెదలలా పెద్ద కళ్లు - బంగారు ఛాయ - బాజాకారపు నుదురుపై ఎగిరే ముంగురులు సరిచేసుకుంటూ చెయ్యి ఆడించింది ఆమె సంతోషంగా. మా వదినె ముఖం ఆనందంతో వెల్లివిరిసింది.

"ఓ సావిత్రి!"

అంటూనే మా వదినె వెళ్లి ఆమె ప్రక్కఖాళీగా ఉన్న కుర్చీమీద కూర్చుంది

దూరాన్నుంచి వింటున్నాను. వారిద్దరి మధ్యా ఏవో చాలా రహస్యాలు నడిచాయి మా వదినె రమ్మంటే నేనుకూడా వెళ్ళి వాళ్ళ ప్రక్కనే కూర్చున్నాను

సినీమా అయినాక మా వదినె అంది

"ఇతను మా మరిది" అంటూ సావిత్రికి, ఆమె భర్తకు, పరిచయం చేసింది నన్ను నేనొక నమస్కారం పెట్టాను

"పెళ్ళయిందా" అన్నాడు ఆయన చిరునవ్వుతో ఆ నవ్వులో మాత్రం ఆయన చాలా సుఖపడుతున్న సంసారిగా కనిపించాడు

"పెళ్ళిచేసుకోనని ప్రతినపట్టి, భీష్ముడులెండి మావాడు" అంటూ ఎగతాళి చేసింది మావదినె అందరూ నన్ను చూసి ఘొల్లున నవ్వారు నా కేమనాలో అర్థం కాక తల వంచుకు మామూలుగా నడిచాను

సావిత్రి, మావదినె చిన్ననాటి స్నేహితులు. ఆమెకు నా వయసే వుంటుంది సావిత్రి భర్త స్కూల్ యినస్పెక్టరు. బదిలీ మీద యీ వూరువచ్చి మూడు నెలలయింది.

ఒకడు: నేనంటే అందరికీ ఎందుకో అంత ఇది? వెధవది వారానికో ఆదివారం - హాయిగా పడుకొని రెస్టు తీసుకుందామంటే, ఆ వేళే ఎంతో మంది 'విజిటర్సు' తెల్లారినాక నాకోసం ఓ ఏభైనిమిది మందైనా వచ్చిపోయివుంటారు నే నెవ్వరికీ దర్శన మివ్వలేదు ఆ భాగ్యం నీ కొక్కడికే దక్కింది: సంతోషించు.

ఇంకొకడు: ఆ ఏభైనిమిది మందీ ఎవ్వరో కాదోయ్ మిత్రమా! నేనే ఏభైనిమిది సార్లు వచ్చిపోయాను ఇన్నట్లు నా బాకీసంగతి ఏం చెప్తావు?

జి వి జి కృష్ణ (మద్రాసు)

తరువాత తరుచు నేనూ మావదినె సావిత్రిగారింటికి వెళ్లేవాళ్ళము. ఒక్కొక్క సారి మా వదినె నన్ను బలవంతంగాకూడా తీసుకు వెళ్ళేది చనువు బాగా పెరిగాక ఆమెను నేను సావిత్రమ్మ అని పిలిచేవాడిని. మా వదినె, ఆమె, నన్ను చూసి ఏవో గుసగుసలాడుకుని, కిలకిల నవ్వుకునేవారు

కొన్ని రోజులు గడిచాయి సావిత్రమ్మ ప్రవర్తనలో చాలా మార్పులు కనిపించాయి నేను కనిపిస్తే చిలిపి గంతులు వేసేది కిలకిలా నవ్వేది నోటికి వచ్చినట్లు వేళాకోళం చేసేది ఇంటికి వెడితే ఏదో ఒకటి తినడానికి పెట్టేది అస్తమానూ నాదగ్గర కూర్చుని కబుర్లు చెప్పేది

ఆమె ప్రవర్తనలోని మార్పులు, పాతికేళ్ళు వచ్చినా పిల్లలులేక బలిష్ఠమై అందం వీడని ఆమె శరీరం, నా భావాలలో ఒక విచిత్రమైన మార్పు తెచ్చాయి నాలో ఎవో బలవత్తరమైన కోర్కెలు ఏర్పడ్డాయి

తరుచు ఆమె యింటికి ఒంటరిగా వెళ్ళేవాడిని ఒంటిమీద చెయ్యి వేస్తే ఆమె ఊరుకునేది నాలో కోర్కెలు పెరిగాయి

ఒకరోజు పార్కుకు వెళ్ళాము నేనూ, మా వదినె ఆమెతో కలిసి ఒక పూపొద దగ్గర కూర్చున్నాము సావిత్రమ్మ నాకేసి చూసి ఫకఫకా నవ్వింది

"ఎందుకు నవ్వుతారు?" అన్నా

"మిమ్మల్ని ఒక ప్రశ్న వేస్తాను కోపం రాదుకదా?"

"రాదు చెప్పండి"

"మీరు పెళ్ళి ఎందుకు చేసుకోరూ?"

నాకు నిజంగా కోపం వచ్చింది ముఖం జేవురించింది నాకు చనువిచ్చిన పరస్త్రీ యిటువంటి ప్రశ్న వేస్తే అర్థం ఏమిటి? నన్ను ఎగతాళి చేసినట్లనిపించింది చాలా బాధపడ్డాను కాని మాట్లాడలేదు

"మాట్లాడరేం కోపం వచ్చిందా?"

"లేదు"

మా వదినె నాకేసి తదేకధ్యాన్నంతో చూస్తూ వింటోంది

"మరి, ఎందుకు చేసుకోరూ?"

ఏమీ చెప్పలేకపోయాను, లోపల బాధవల్ల

"చదువు లేదనా?"

"లేదు"

"చదివిన బి ఏ చాలదా?"

"నాకన్న ఎంతో ఎక్కువ చదువుకున్నవాళ్ళున్నారు"

"ఆశకు అంతేముంది?"

సమాధానం చెప్పలేకపోయాను

"డబ్బు లేదనా?"

"లేదు తెచ్చే రెండు వందల జీతం నా ఖర్చుకు చాలదు భార్యనెలా పోషించగలను?"

"కానీ గడించలేని ముష్టి దంపతులు కూడా ఆనందం అనుభవిస్తున్నారు"

ఎదురుమాట చెప్పలేకపోయాను.

"అందం లేదనా?"

"కాదు"

"నా కళ్ళతో నేను చూడటంలేదూ?"

ఆమెకేసి నిదానించి చూశాను నవ్వింది నేను లోలోపల సంతోషించాను, నన్ను అందగాడిగా భావించే స్త్రీ ఒకతైనా ఉందికదా అని

తిరిగి మౌనం నాలో

నామౌనం ఆమెకు కోపం తెప్పించింది

"పిల్లలు పుటరని భయమా?" గర్జించింది ఆమె కోపంతో

ఆ ప్రశ్న నాగుండె ఛేదించింది మనోనిగ్రహంతో వయస్సులో పెండ్లి చేసుకోకపోతే నపుంసకుడిగా భావించే సంఘం కూడా ఉంటుందన్నమాట ఆమెకు పిల్లలు లేకపోవడంవల్ల ఆమాటల్లో నాకు ద్వంద్వార్థం స్ఫురించింది

నాలో భరింపరాని ఆవేదన కలిగి వెక్కి వెక్కి ఏడ్చాను నా ఏడ్పు చూసి ఆమెకు జాలి బాధ కలిగాయి మావదినె ఆశ్చర్యపోయింది నేను ఏడ్వడం మునుపు ఎప్పుడూ ఆమె ఎరుగదు

"మరి చెప్పరూ? చెప్పకపోతే నేచచ్చినంత ఒట్టు" అంటూ ఆమె నన్ను అనునయించింది మావదినె కూడా అదే ఒట్టు పెట్టుకుంది

కాని ఏంచెప్పను? ఏముంది చెప్పడానికి? నాకు స్త్రీ అంటే ఏదో చెప్పలేని అసహ్యం కాక మరేమీ లేదు కాని స్త్రీలోకం నన్ను అపార్థం చేసుకోడం నాకు యిష్టం లేకపోయింది

గోపాలం జీవితంలో జరిగిన విషాదగాథ నాగాథగా వర్ణించి వారితో చెప్పాను "ఆమె పెళ్లి చేసుకోకపోవడంవల్ల స్త్రీఅంటే నాకు అసహ్యం, విరక్తి కలిగింది అందుచేత నేను ఏస్త్రీని యికముందు పెళ్ళి చేసుకోలేను వయస్సులో ఒక్కొక్కసారి మనస్సు చలించి కొన్ని పొరపాట్లు చేస్తాము కాని యికముందు చాలా జాగ్రత్తగా ఉంటాను" అంటూ ఆమెను ఉద్దేశిస్తూ పశ్చాత్తాపంతో నిట్టూర్చాను

సావిత్రమ్మ జాలిగా నాకేసి చూసింది ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి

"యీ చిన్న విషయంకోసం పెళ్ళి మానేస్తారా? మంచి ఆడవాళ్ళు ఎంతమంది లేరు యీ ప్రపంచంలో"

"ఏమైనా సరే నే పెళ్ళి చేసుకోను" అంటూ నిశ్చయంతో చెప్పాను

అక్కడితో ఆ సంభాషణ ముగిసింది ఆనాటినుంచి సావిత్రమ్మ నాకు మరీ చనువుయిచ్చింది నేనణచుకున్న కోర్కెలు నాలో తిరిగి చెలరేగాయి



# పెళ్లి భయం



ఒకరోజు మాటలసందర్భంలో 'మా వారు వూళ్ళోలేరు నాల్గురోజులదాకా రారు నువ్వువచ్చి యిక్కడ పడుకోకూడ దమ్మా లక్ష్మీ!' అంటూ మా వదిన సుద్దే శిస్తూ, నా కేసి సావిత్రమ్మ అదోవిధంగా చూసింది

నేను మొదట గాభరాపడ్డాను. కాని మనసు దిటవు చేసుకున్నాను

మా వదిన రావడానికి వీలుండదని చెప్పే సింది

రెండో ఆట సినీమాకి వెళ్ళివస్తూ, సావిత్రమ్మ తలుపు తట్టాను ఆ రాత్రి తలలో ఎన్నో ఆలోచనలు పరుగులెత్తాయి అవసరమైతే సావిత్రమ్మను ఏదోవిధంగా పెళ్లి చేసుకోవాలనే నిశ్చయానికి కూడ వచ్చే శాను



తలుపుశబ్దం విని, ఆమె లేచివచ్చి కిటికీ రెక్కలు తీసింది.

"మీరా?"

"సినీమాకి వెళ్ళివస్తూ, మిమ్మల్ని చూద్దామని వచ్చాను" అంటూ భయంతో నవ్వాను.

"రేపు రండి చూడవచ్చు" అంటూ కిటికీ తలుపులు ధళ్ళున వేసింది ఆమె.

నాకు చెప్పరాని కోపం వచ్చింది వలచి వలపించి, పలికి పలికించి, నవ్వి నవ్వించి కవ్వించిన స్త్రీ యిలా చేస్తే ఏమనుకోవాలి? నన్నొక ఆటబొమ్మగా చేసిందనే ఉక్రోషం నాలో పెరిగింది

మర్నాడు మా వదిన నన్ను సావిత్రమ్మగారింటికి రమ్మంది నాకు తప్పని సరి అయింది, యింట్లో మరెవరూ లేకపోవడం వల్ల మా వదినతో ఆమె క్రితం రాత్రి జరిగిన విషయం చెబుతుందేమో అని భయపడుతూనే వారింటికి వెళ్ళాను

ఇంట్లో అడుగు పెట్టగానే సావిత్రమ్మ నన్ను చూసి మామూలుగా నవ్వుతూ స్వాగత మిచ్చింది కొంత భయం తగ్గింది నాకు కాని మరుక్షణంలో మా వదిన, ఆమె, గుసగుసలాడుకున్నారు. నా ప్రాణాలు నిలువునా పోయాయి మా వదిన నవ్వుతూ బయటికి వచ్చింది. నేను తమాయించుకున్నాను ఇంతలో మూడుకప్పుల కాఫీ యింట్లోంచి తెచ్చింది సావిత్రమ్మ

కాఫీ త్రాగుతున్నాం ఆమె నా కేసి నిదానంగా ఒకసారి చూసి నవ్వింది

"మీ విషయంలో ఒక అపచారం చేశాను" అంది సరిగ్గా ఆ మాట నేననవలసినది కాని ఆమె అనడంవల్ల, ఆ మాటలో నాకు అనేక అర్థాలు స్ఫురించాయి అయినా ఆ విషయం మా వదిన ఎదురుగా చెపుతుందేమో అని నాకు ఆశ్చర్యం కలిగింది

"మీ మనో నిగ్రహం పరీక్ష చేశాను"

ఆమాట వినగానే, నేను వెర్రిమొహం వేశాను

మా వదిన ఫక్కున నవ్వింది, యీ నాటకంలో తనూ ఒక పాత్రధారినని వ్యక్తం చేస్తూ

ఆమె మౌనంగా మందహాసం చేసింది ఆ మందహాసంలో ఎన్నో అందాలు తొణికిసలాడాయి అది మరుపురాని తీయని దృశ్యం

మా వదిన కళ్లు సంతృప్తితో మెరిశాయి ఆడదాని చేతిలో చలించిన నేను ఎప్పటికైనా తప్పక పెళ్ళి చేసుకుంటానని ఆమెకు ధైర్యం కలిగిఉంటుంది,

నేనుమాత్రం నిజంగా చాలా బాధపడ్డాను పరిస్థితులు ఈ రూపం దాల్చి

# పెద్ద మనుషులు

**పి. పరంధామయ్య**

తండ్రికి ప్రమాదంగా ఉన్నదని టెలిగ్రాం అందగానే జగన్నాథం గౌకారయికీ తన స్వగ్రామం బయలుదేరాడు. రైలుపెట్టెలో భార్యాపిల్లలను సందుచేసి కూర్చోబెట్టి - సామాను భద్రంగా వుండేందుకు - తన కెదురుగా వున్న పై చెక్కపై దాన్ని సర్దిపెట్టాడు. రైలు కూతేసి కదలగానే భార్య ప్రక్కన కాస్త సందు చేసుకొని కూలబడి - గంపెడు భారం నెత్తినుండి తొలగినట్లు - గట్టిగా వూపిరి పీల్చాడు. అప్పటివరకు ప్రయాణ సన్నాహంలో పూర్తిగా లగ్నమైయున్న అతని మనస్సు ఆ భారం తొలగినప్పుడైనా - తేలికపడే భాగ్యం నోచుకోలేదు. మరు క్షణంలోనే ఖాళీ మూడవతరగతి పెట్టెలోకి ప్రయాణీకులు దూరినట్లు - అనేక దుశ్చింతలు అతని తల్లో దూరి చీకాకుపర్చసాగినై "ఇంతకూ ఆయన కెట్లుంటుందో - యింటికి వెళ్ళిందాకా" ఆ వూహ తలపుకు రాగానే అతని గుండె గబుక్కుమంది. కళ్ళ నీళ్ళుకూడ వచ్చినై. నాలుగేండ్లనాడు తండ్రితో పోట్లాడి యిల్లువదలి వెళ్ళేప్పుడు - యిటువంటి తండ్రి వున్నా వొకటే - చచ్చినా ఒకటే అనుకున్నాడు. అది తలచుకొని - "ఆయనేం జేశాడు అంతా పిన్నమ్మే - ఆమెచేత చీవాట్లు తింటూ - యింట్లో పడివుంటా ననుకొంది పిచ్చితల్లి" తనవిషయం యిప్పటికైనా తెలిసివుండకపోదు - నాలుగేండ్లనాడు నిరాధారుడై యింటనుండి వెళ్ళిన జగన్నాథం యిప్పుడు ప్రయోజకుడై తిరిగి యింటికి వస్తున్నాడు. దాని కతనికి సంతోషంగానే వుంది. ఇంటివద్ద తన్నే విధంగా చూస్తారో - యిరుగు పొరుగు తన యిప్పటి స్థితికి తప్పక విస్మయపడతారు. జగన్నాథం యివే వూహాల తన్మయత్వంలో మునిగి తోటి ప్రయాణీకుల సంభాషణలో ఏ జోక్యం కలిగించుకోలేదు. అతని భార్య రాజమ్మ కూడా ఏదో ఆలోచిస్తూ పరధ్యానంగా వుంది "ముసలాయన గుటుక్కుమంటె -" ఆమెకు తన మామగారు చచ్చి వుంటారని గట్టి నమ్మకం వుంది "ఇప్పుడే పంపకాలు జరిగించి తీరాలి. తలా దోశెడు తీసుకొని - ఆ కొంపకు గూడా అడ్డం కట్టించి—" తన కసి తీరటానికి యింకా యేమేమి చేయాలో ఆలోచించుకోసాగింది రాజమ్మ. అత్తగారింట్లో రాజమ్మ కూడా చాలా బాధలు పడ్డది. ఆ బాధలన్నీ తలచుకొని - "అత్తగాదు నాపాలిటి బ్రహ్మరాక్షసి. ముసలి మొగుణ్ణి కట్టుకొని కులుకుదామనుకొంది - యిక తెలుస్తుందిలే" - అందమైన రాజమ్మ ముఖం క్రోధంతో నల్లబడిపోయింది. నిద్రపోతున్న పిల్లవాడు అప్పుడే లేచి గోలపెట్టసాగాడు. రాజమ్మ ఎంత సముదాయించినా వాడు వూరుకోలేదు. జగన్నాథం తన కేమీ పట్టనట్లు కూర్చోటం చూసి ఆమెకు కోపం వచ్చింది "చూస్తూ కూర్చోకపోతే - వొక్క క్షణం వీణ్ణటు తీసుకోగూడదూ—" ఈ చిన్న మందలింపుతో జగన్నాథం వూహాలమైకం కాస్త వదిలింది. పిల్లవాణ్ణి తీసుకొని బుజ్జగించసాగాడు. ఇంతలో ఎదుటి బెంచీపై కూర్చున్న ముసలామె - "ఎక్కడ దిగుతారమ్మా—" అని అడిగింది.

"కావలి - రేపు మధ్యాహ్నానికి కాని అక్కడకు చేరం. అప్పుడే నడుములు పట్టుకపోతున్నయ్" అంటూ రాజమ్మ భర్త అందిచ్చిన పిల్లవాణ్ణి తీసుకొంది.

జగన్నాథం కావలి స్టేషనులో రైలు దిగి బండి కట్టించుకొని - మధ్యాహ్నం రెండు గంటలకు తన గ్రామం చేరాడు.

ఇల్లు దగ్గరపడేకొలది అతని ఆందోళన కూడా జాస్తయింది. బండి దిగి యింట్లో అడుగుపెట్టగానే - వడమటింట్లో ఏడ్పులు వినరాసాగినై. ప్రక్కింటి ఆమె ఎవరో - "అంతా మించిపోయింది నాయనా" అంటూ కళ్లు తుడుచుకోసాగింది. జగన్నాథం గుండెల్లో బండపడ్డట్టయింది. అక్కడే వున్న బెంచిపై కూలబడిపోయాడు. ఎంత అణచుకున్నా దుఃఖం పొంగి రాసాగింది అతనికి. "అవసానదశలో తండ్రిదగ్గర వుండలేకపోయాను - వుంటే యేమి చెప్పునో యింత ముట్టిమోపు కొచ్చిందాకా తనకెందుకు తెలుపలేదు. యిదంతా పిన్నమ్మకుట్రె - ఆమే నాన్నకు నాకూ కాకుండా జేసింది. ఆమెవల్లనే తనకు తన తండ్రికి పోట్లాట వచ్చింది. తాను యిల్లువదలి - పరరాష్ట్రింపోయి బ్రతుకుతెరువుకై పడరాని పాట్లు పడవలసి వచ్చింది. ఆఖరికి అవసానదశలో కూడా తండ్రిదగ్గర వుండనీకుండా జేసింది. యిదంతా ఆమెపనే -" జగన్నాథం క్రోధంతో వివశుడై - వడమటింట్లో చాప చుట్టగా పడివున్న పిన్నమ్మవద్దకు రెండంగల్లో పోయాడు. ఆమె జగన్నాథాన్ని చూడగానే బావురుమని యేడుస్తూ అతన్ని పట్టుకొంది. నాలుగేళ్ళనాటి పిన్నమ్మ యీమేనా - "జన్నాథం నిలువునా కూలిపోయి వెక్కివెక్కి ఏడువసాగాడు. చుట్టూ జనం మూగారు. ఎవరో జగన్నాథాన్ని పట్టుకొని ముందరింట్లోకి తీసుకొచ్చారు. దానితో పిన్నమ్మపై అతనికున్న దురభిప్రాయం పూర్తిగా తొలగిపోయింది. తండ్రిగారి కర్మకాండలో ఆ పదిరోజులు పూర్తిగా మునిగిపోయాడు. రాజమ్మకూడా - ఆమెకు మనసులో ఏలాంటి వూహాలున్నా - పైకి మాత్రం అందరితో కలసి మెలిసి వుండసాగింది.

పెద్ద కర్మయైన మరునాడే కుటుంబపు గొడవలు బయట పడసాగినయ్. అప్పులు - లావాదేవీలు - కుటుంబాని కున్న నాలుగెకరాలు అప్పులకు చాలేట్టులేదు. పిన్నమ్మ, ముగ్గురు పిలలు వారి పోషణభారం ఎవరు వహిస్తారు. ఇంత బాకీ ఎందుకయిందో? ఫలాని దానికయిందని వొక్కరూ చెప్పరు. ఎప్పుడూ దమ్మిడీయైనా చేబదులు యివ్వని బంధువులు వేలమొత్తాలు చేజాబైనా

---

నందుకు. కాని తప్పని సరిగా, పెడదారి త్రొక్కిన మనస్సుకు కళ్లాలు బిగించి సావిత్రమ్మ విషయంలో ఒక్క స్నేహమే పెంపొందింప చేయ దలుచుకున్నాను.

కాని ఆమె నిజవిషయం నాకు అర్థం కాలేదు. నా జీవితంలో యిప్పటివరకు నాకు కనిపించిన స్త్రీలు అర్థంకాక, నాకు అసహ్యం కలిగించారు. కాని సావిత్రమ్మ నాకు జీవితానికి సరిపడే మనోవ్యథ కలిగించింది. ఇంక నేను పెళ్ళిచేసుకో దల్చుకోలేదు. ★

#  పెద్దమనుషులు 

లేకుండా ఎందుకిచ్చారో - జగన్నాథానికి ఎంత ఆలోచించినా అంతుబట్టలేదు బీడి ముట్టించి వరండాలో పచారుచేస్తూ - యివన్నీ ఎట్లా పరిష్కారం చేస్తామా అని ఆలోచిస్తున్నాడు ఇంతలో అతని మేన మామయైన సుబ్బరామయ్య వొక పెద్ద పట్టె అతని చేతికిస్తూ - "ఆయన మంచంలో పడింది మొదలు - ఇప్పటిదాకా నేను పెట్టిన కర్చులు - గుర్తు రాసిపెట్టాను - చూడు-" అంటూ అక్కడున్న బెంచీపై కూర్చొన్నాడు

"యీాయేగు వడ్డగింజ లేమి అమ్మ లేదూ-' నెమ్మదిగా అన్నాడు జగన్నాథం

"అమ్మ డబ్బు నాచేతికిస్తే - నేనెందుకు పెట్టానని చెప్తాను"

"మీరు చెపుతారని కాదు. యితర బాకీల విషయం ఏమాలోచించారు"

"మొత్తాలన్నీ రాసి నీ చేతికిచ్చానుగా- వాటిలో కొన్నిటికి ప్రోనోట్లు లేవు మనలో మనకెందుకని నోటు వ్రాయించ లేదు"

"ఇదంతా దేనికి పెట్టినట్లు. నేనుండగా వొక్క దమ్మిడి బాకీ లేదు"

"జబ్బుపడ్డాడు చిల్లరబాకీలు వుండేవి. అవి తీర్చేశాడు. యిక డాక్టర్లకి - మందులకు - ఏమిటీ - సందేహపడుతున్నావే"

"అబ్బే సందేహ మేముంది కాని - కాస్త గీతవుంటే బాగుండేది"

"నిజమే - కాని ఆ పరిస్థితుల్లో ఆయన్ని ఆమాట అడగలేక పోయాను"

"ఆ స్తికం టె బాకీలు మించివున్నయ్ - వీటి నెట్లా చేయాలో"

"నేను యింటిదాకా పోయివస్తాను - తర్వాత ఆలోచించి—"

"మీరుపోతే యెట్లా-యీా గొడవలన్ని"

"నాకు తొందర పనుంది - యెల్లుండి యీా వేళకు వస్తాగా"

"తప్పకుండా రావాలి"

"వస్తా నన్నాగా -" అంటూ బయలు దేరాడు సుబ్బరామయ్య అంతవరకు గోడ చాటున నిలబడి వీరి సంభాషణంతా వింటూన్న రాజమ్మ భర్తదగ్గరికొచ్చి - ఏదో రహస్యం చెప్పబోతున్నట్టు చుట్టు ప్రక్కల జూసింది జగన్నాథం విసుగ్గా "ఏమిటి" అన్నాడు

"యిదంతా ఏదో కుట్రగా వుందండి. మనకేమి మిగల్చకుండా"

"మనకు మిగిలి ఏడుస్తుందని వొకప్పుడు అనుకున్నామా - ఆ పిల్లనుకూడా మన యెదాన తోసేట్టున్నారు"

"ప్రోనోటు లేని బాకీ వొక్కటీ వొప్పుకోబోకండి"

"ఆమె వొప్పుకుంటూవుంటె"

"ఆమె వొప్పుకుంటుందిలే - మీ సవతి తల్లి వొకప్పుడు మీకు మేలుచేస్తుం దనుకు న్నారా"

"ఏమిటో నాకు - యిదంతా అగమ్య గోచరంగా వుంది"

"వూళ్లో పెద్దమనుషులు లేరూ- చెప్పండి"

"అబ్బే - యింటిగుట్టు రచ్చకెక్కించ మంటావా"

"లేకుంటే యిదంతా నెత్తినేసుకొని—"

"చూస్తాం - తొందరపడితే యెట్లా."

"మనల్ని వీళ్ళు వొకప్పుడు సుఖ పెట్టారా-యిప్పుడు పెట్టడానికి-మీరేమో- మీవారని వాళ్లలో జొరబడుతున్నారు గాని—"

"లోకంకోసం——లేకుంటే వీళ్ళ వెధవ చేష్టలు తెలియకనా "

"అందుకనే–పెద్దమనుషులతో చెప్పితే– ఆ బాకీలు నిజమో - లేక తప్పుడు వ్యవహారమో బైటపడుతుంది."

"సరే యిక నేం జేస్తాం–పోయివస్తాను కానీ నీవుమాత్రం యీ విషయం అప్పుడే టాంటాం వెయ్యబోకు "

"ఎప్పుడూ నా పని అదే - ఎందుకండి నేనంటె అంత చులకన " రాజమ్మ కళ్ళనుండి జోటజోట నీళ్లు కారినయ్

"అబ్బే యిప్పుడేమన్నానని ఛా ఛా తప్పకదూ–తుడుచుకో యిటురా నేను–" వొక అడుగు ముందుకు వేశాడు జగన్నాథం

"తుడిచినంత ఫలం - ఏడ్పించకుంటె " రాజమ్మ పైటకొంగుతో కళ్లు వొత్తుకుంటూ దొడ్లోకి వెళ్ళిపోయింది

జగన్నాథం వెంటనే పెద్దమనుషుల దగ్గరకు పోవటానికి నిశ్చయించుకున్నాడు "పోయి మాట్లాడుదాం - వచ్చిన నష్ట మేముంది" అనుకుంటూ పైగుడ్డ వేసుకొని బయలుదేరాడు అతడు వెళ్లేప్పటికి - రంగయ్య వాలుకుర్చీలో పండుకొని కునుకు తీస్తున్నాడు జగన్నాథం అడుగుల చప్పుడుకు రంగయ్య కళ్ళు తెరచి - "ఎవరు నీవా–రా యిప్పుడే కళ్ళు మూశాను ఆ కుర్చీ యిటు లాక్కొని కూర్చొ" జగన్నాథం కుర్చీలో కూర్చుంటూ - "నేను యింటినుండి వెళ్ళి నాలుగేళ్ళకు పైగా అయింది ఇంటి వ్యవహారా లేమీ తెలియవు బాకీలు పరిష్కారం చేసిపోదామనుకుంటున్నాను మీరూ కొంచెం సహాయపడితే——" యింటివద్దనుంచి అనుకుంటూ వచ్చిన మాటలు వెళ్లగక్కాడు

"ఆ ఇందులో నా సహాయ మేముంది చిక్కులేమన్నా వున్నాయా "

"మా వాళ్లకేదో యివ్వాలని చెపుతున్నారు నోటు లేదట "

"మీ మేనమామ - సుబ్బరామయ్యకా "

"అవునండి వారికి — వారి తరఫునా "

"ఏమాత్రం–"

"రెండు వేలదాకా - వున్నదని చెపుతున్నారు."

"చంగయ్యతో మాట్లాడకపోయావా "

"లేదండి– మొదట మీవద్దకే వచ్చాను "

"వారితో కూడా చెప్పండి యివన్నీ లేనిపోని చిక్కులండి తీసుకపోతారు యివ్వరు యిస్తారులేఅనుకుంటాము ఆఖరికి యిటువంటవే చిక్కులు సరే చంగయ్యతో చెప్పండి అదుగో ఆయనే వొస్తున్నాడు " అనగా జగన్నాథం వాకిలివైపు తిరిగాడు చంగయ్య తన భారమైన దేహాన్ని అతిప్రయాసతో కుర్చీలో చేరవేసి - ఏమిటీ అన్నట్లు రంగయ్యవైపు చూశాడు

"జగన్నాథం మీదగ్గరికి రావాలని అంటున్నాడు ఏవో కుటుంబ గొడవలట - చెబుతున్నాడు ఇంతలో మీరు వచ్చారు "

"నాదాకా ఎందుకు - మీరే కానీండి మీమాటకు కాదనే దేముంది యింతకు విషయమేమిటి?"

"బాకీల పరిష్కారం వీరి మేనమామ సుబ్బరామయ్య తనకూ కొంత యివ్వాలని అన్నాడట దానికి నోటులేదని .."

"యీ కాలంలో ఎవరినీ నమ్మటానికి లేదండి అంతా తప్పుడు ఎత్తుగావుంది "

"అంటే నీవనేది సుబ్బరామయ్య బాకీ తప్పుడుదిఅనా "

"ఏం. అయివుండగూడదూ - లేకుంటే ప్రోనోటు - "

"నీకేమాత్రం - "

"దాదాపు రెండువేలు. ఎప్పుడడిగినా రేపూ - మాపూ - చెల్లు వుండదు ఆఖరికి యిదీ వరస దామాషాలు - "

"దామాషా అని ఎవరన్నారు"

"దామాషాలు కాకపోతే మనదాకా ఎందుకొస్తుంది. తెలియనట్టు అడుగుతావేం రంగయ్యా!"

"ఇప్పుడు మనముందు వుండేది బాకీలు చేసిన రామనాథం కాదు అతని కొడుకు జగన్నాథం దామాషాలవిషయం యితనేమీ చెప్పడంలేదు బాకీలు పరిష్కారం చేస్తానంటున్నాడు అంతే - "

"అంతేలే పాపం-యీయన దేముంది "

"ఎట్లాజేస్తావో చెప్పు సుబ్బరామయ్యకు రెండువేలు - వూళ్లో అయిదువేలు - వడ్డీలతో ఎనిమిదివేల దాకా వుంది దీనిగ్గాను వుండేది - నాలు గెకరాల కొండ్ర "

"నీవే ఆలోచించు "

ఈమాటతో రంగయ్యముఖం గంభీరమై– కళ్లు మూతలుపడిపోయినయ్ పదినిమిషాలు తీవ్రంగా ఆలోచించిన మీదట

"నేను నాకు తోచింది చెబుతాను - మీకు నచ్చితే-" తల వూపుతూ అన్నాడు రంగయ్య "

"చెప్పండి-పరిస్థితులన్నీ మీకు తెలుసు- నన్ను గురించి నాకే చింతా లేదు పిన్నమ్మ– బిడ్డలు - వారి కేదైనా ఆధారం "

"నేను చెప్పినట్లు కచ్చితంగా చేయగలవా అని "

"చేయటానికేగా యింతదూరం మీ వద్దకు వచ్చింది "

"మీ సవతి తల్లిని వొప్పించాల్సి వుంటుంది సుబ్బరామయ్య సామాన్యుడు కాదు - ఆయనేం ప్లాను వేశివున్నాడో "

"ఆయన లేడులెండి - పిన్నమ్మ వొప్పుకొంటే - ఆయన దేముంది"

ఒకరోజున భార్యా భర్తలు తీవ్రంగా మాటా మాటా అనుకున్నారు. భర్త కోపగించి అవతలికి వెళ్లిపోయి, ఏడాది తరవాత మళ్లా ఇంట్లో అడుగు పెట్టాడు. "ఎక్కడికి వెళ్లినట్లు" అని భార్య ఘుర్ఘురించింది.

భర్త తడబడుతూ "ఆ, ఎక్కడికీ లేదు.ఊరికే అటు కేసి వెళ్లొచ్చాను," అని సమాధానం చెప్పుకున్నాడు.

"సరే అంతశక్తి నీవద్దవుంటె - పొలం చంగయ్యకు విక్రయం చెయ్యి యెకరా పగ పేనువందలు - బాకీదార్లను ముప్పావులా లెఖన తీసుకునేట్టు వొప్పిస్తాను "

"సరే - అట్లనే చేస్తాను "

"సరే - అంటె కాదు మీ సవతితల్లి - ఆమె పేరు "

"సుదర్శనమ్మ "

"సుదర్శనమ్మను కనుక్కొని–ఆ విషయమూ చెప్పితే - స్టాంపులు తెప్పించి వ్రాయించేస్తాం "

"అట్లనే - పిన్నమ్మను కనుక్కొని "

"ఇంకో విషయం - వ్యవహారం సులభంగా పరిష్కారం కావటం యీ వూళ్లో కొందరికి యిష్టం వుండదు అటువంటి వాళ్ళను కొంచం కనిపెట్టి వుండండి "

"సరే యిక నే వెళ్ళివస్తా - " అంటూ లేచాడు జగన్నాథం

"అట్లనే——" అని రంగయ్య అనగా - జగన్నాథం యింటికి వెళ్లాడు. సుదర్శనమ్మతో అన్ని విషయాలు చెప్పాడు

"అన్నయ్య వచ్చాక మాట్లాడకూడదూ" ఆమె సందేహంగా అన్నది

"ఆయ నొచ్చిమాత్రం చేసేదేముంది. తరువాత వాళ్ళ బుద్ధి ఏవిధంగా మారుతుందో "

"సరే - నీయిష్టం అన్నయ్యబాకీ "

"అదీకూడా - మిగతావాటి మాదిరే పరిష్కారం అవుతుంది "

"పిల్లలగతీ - నాగతి కొంచెం మనసులో వుంచుకొని——"

"—కంతమాత్రం తెలియదు పిన్నమ్మా?"

ఆరోజు సాయంత్రం జగన్నాథం రంగయ్య దగ్గరికి పోయి - పిన్నమ్మ వొప్పు

# ★ పెద్దమనుషులు ★

కళ్లనీళ్లు పెట్టుకుని శ్రీమతి: "చూశారా! పక్కింటావిడ, సరిగ్గా నా చీరమాదిరిదే కొనుక్కొచ్చింది..."

భర్త విసుగుతో:—"ఇప్పుడేమంటావ్? మళ్ళీ ఇంకో మాదిరి చీర కొనమంటావా!"

భార్య: "అవును మరి, లేకపోతే ఇప్పుడు మళ్ళీ ఇల్లు మారగలమా?"

వున్నదని చెప్పాడు. అక్కడే రంగయ్య కూడా వున్నాడు

"అయితే గుమస్తాను పిలిపించి స్టాంపులు వ్రాయించకూడదూ"

"స్టాంపు లున్నాయా—సర్వే నెంబర్లు"

"అన్నీ గుమస్తాను చూడమని చెప్పాను చూచేవుంటాడు"

గుమస్తావచ్చి స్టాంపులు వ్రాశాడు జగన్నాథం చేవ్రాలు చేసి సుదర్శనమ్మ చేత చేవ్రాలు చేయించుకొని వచ్చాడు ఇంతలో గుమస్తా ఎవరెవరికి ఎంతియ్యవలసిందీ – పట్టీ తయారుచేశాడు. బాకీదార్ల ప్రోనోట్లన్ని రంగయ్య తెప్పించుకొన్నాడు ప్రోనోట్లు రద్దుచేసిన తర్వాత జమా కర్చు పట్టీ తయారు చేశాడు గుమస్తా ఆ పట్టీ రంగయ్య చూసినతర్వాత జగన్నాథం చేతి కిచ్చారు పట్ట పైనుంచి క్రిందికి చూసి, తెల్లబోయాడు అంకెలు భూతాల్లా కనబడుతున్నయ్ అతని గుండెల్లో దడ బయలుదేరింది ముచ్చెమటలు పోస్తున్నయ్ నిల్వ జమ మొత్తం రెండు వందలా ముప్పై జగన్నాథం మొగం గుర్తు పట్టలేనంతగా వివర్ణమయింది ఏదో చెప్పబోయి గుటకలు మింగసాగాడు రంగయ్య అతని అవస్థంతా కనిపెట్టి "లెఖలో ఏమన్నా పొరుందా—"

"మీ మొత్తాలు తగ్గించి వేయలేదు"

"మేము తగ్గించుకొంటామని చెప్పామా– మిగతావి సరిపోయినవి కదా"।

"మీరు మొదట చెప్పింది—"

"ఏం జెప్పాం మావి తగ్గించుకొంటామని చెప్పామా – చేతులారా యిచ్చి—" రంగయ్య కస్సుమన్నాడు

"ఆమె కేమని చెప్పేది. పెద్దమనుషులని మీదగ్గర కొస్తే–"

"ఇచ్చిన డబ్బుతీసుకొంటేఎందుకయ్యా అంతమంట నీడబ్బు వొక్క దమ్మిడి మాకు వద్దు. యింకా బాకీదార్లకు నచ్చజెప్పి – ఆ కొంప తలదాచుకోటానికి వుంచాము మనుషులకు కృతజ్ఞత వుండదయ్యా – ఎంతసేపూ పరుషసాత్తు దిగమింగాలనే–" రంగయ్యకు చాలాకోపం వచ్చింది

"చేను విక్రయ ఖర్చంతా నా నెత్తినే వేశారు"

"అవును మీఖర్చులతోనే చేనువిక్రయం చెయ్యాలి ప్రతిదానికి పేచీ పెడతా వేమయ్యా నేను చేయవలసింది చేశాను. మూడు నెలలలోపల వచ్చి ఆ చేను రిజిష్టరు చేసిపొండి ఆడబ్బు నిలవ నోబయ్యా' లెఖచూసి యీయన కిచ్చివెయ్ రద్దు ప్రోనోట్లు ఆయనకు చూపి - స్టాంపుల్లో పెట్టవుంచు – యిక నేను వస్తా–" అంటూ రంగయ్యా లేచి యింట్లోకి వెళ్ళాగు జగన్నాథం దేబిరి మొగం వేసుకొని - రద్దు ప్రోనోట్లు చూసి - ఆసామి - బాకీ వివరంగా పట్ట వ్రాసుకొన్నాడు నిల్వ జమ రెండు వందలా చిల్లర జేబులో వేసుకొని కాళ్ళీడ్చుకుంటూ యింటికి వచ్చాడు.

అప్పటకే చాలా ప్రొద్దు పోయింది యింట్లో రాజమ్మ వొక్కర్తే మేలుకొని వుంది ఆమె భర్తను చూడగానే - "ఏమి చేసుకొని వచ్చారు - " మంచంమీదనుండి లేస్తూ అన్నది

"ఎత్తుభారం పెద్దమనుషులదగ్గరకు పోయినందుకు - "

"ఇంతకూ ఏమయిందండి - "

"నున్నగా క్షవరం పో, పో, పెద్దమనుషులదగ్గరికి అంటూ నిలవనిచ్చావూ–" అంటూ మంచంపై కూలబడ్డాడు

"మెల్లంగా - ఎందుకండీపొలికేకలు - "

"కడుపుంగోమంట ఏంచేయమంటావ్"

"పీటేశే వుంచాగా పదండి - "

"నీకంత తమాషాగా వుంది"

"అయితే వేళ యింకా కాలేదనా – సగం పొద్దు పోతే - ఏమిటో చెప్పరు – మీరు చెప్పేంత ఫలితం, లేవండి - '

"లోకమంతా తప్పుడుతనంతో నిండి వుందట – వీళ్లు సత్యసంధులైనట్టు - వెధవలు"

"ఏమిటో చెప్పరు-వృత్తి అఘాయిత్యం- ఇంతకూ లేవరూ '

"నీశ్లేప"

"దొడ్లోకి పదండి"

జగన్నాథం కాళ్లు చేతులు కడుక్కొని పీటమీద కూర్చున్నాడు. రాజమ్మ వడ్డించింది జగన్నాథం అన్నం కలుపుకుంటూ–

"చెప్పేదొకటి – చేసేదొకటి – మళ్లీ పెద్ద మనుషులట - పెద్దమనుషులు"

ఇంతలో సుదర్శనమ్మ మేలుకొని వంటింట్లోకి వచ్చింది - "ఏమిటి నాయనా - ఏం జరిగింది"

"పెద్దమనుషులని - వాళ్ళదగ్గరకు పోతే మంచి శాస్తి జరిగింది"

"ఏమి జరిగిందో చెప్పరు - పూరికే కేకలేస్తారు-" రాజమ్మ దూరంగా పోయి నిలబడి అన్నది

"చెప్పు నాయనా! ఏమయింది"

జగన్నాథం జరిగిన విషయమంతా చెప్పాడు సుదర్శనమ్మ అంతా విని "ఆ అందుక నేగా - మీ మామయ్య వచ్చిందాకా"

"అంత తొందరేం – ఈలాగే వీరు ప్రతిది నెత్తి నేసుకొంటూరు-" అంటూ రాజమ్మ దొడ్లోకి వెళ్లింది

"అది కాదు చిన్నమ్మా! మామయ్యకయినా అంతేగా వారు చేసేది—"

"అప్పుడు మనమీద మాట లేకుండా పోయేదిగా–" రాజమ్మ చెంబుతో నీళ్ళు తెస్తూ అంది

"నీవు వూరుకోవే కాస్త - ప్రతిదానికి నేనే నంటావు"

"దీనికోసమే వాళ్లు మీ మామయ్య లేకుండా చూసి తొందరపడ్డది"

"ఏమిటో. యింత తప్పుడుతనం పెద్దమనుషులదగ్గర వున్నదని అనుకున్నామా"

"ఆయన రాగానే తీసుకొనిపోయి - ఆయనైతే బాగా జాడిస్తాడు"

"అట్లనే - లేకుంటే అంత సులభంగా విడుస్తామా"

జగన్నాథానికి తిండి సహించలేదు రెండు ముద్దలు ఏలాగో మ్రింగి - విస్తరి ముందునుంచి లేచాడు, సుదర్శనమ్మ అక్కడనుంచి వెళ్లగానే - చేతులు కడుక్కొంటున్న జగన్నాథంతో - "మామయ్యతో మొరపెట్టుకొంటూరా - ఏమని" రాజమ్మ హేళనగా అంది.

"ఏదో వొకటి అఘోరిస్తాం - నాతో నీ వింకేమీ అనబోకు"

"నేనింక అనా అనను ఏదైనా అనటం- మీరు కోప్పడటం"

"అదే తెలుసుకొనివుంటే మంచిది" అని జగన్నాథం మిట్టవరండాలో వెళ్ళి మంచంపై కూలబడ్డాడు అతని మనసంతా చీకాకైపోయింది "నేను పడేబాధ ఎవరూ

(54-వ పేజీ చూడండి)

# స్వర్గానికి నిచ్చెన

"ఏయ్ బాయ్! పేపర్లబాయ్!" అని గట్టిగా కేకేశాడు రమణ. హోటలు అరుగుమీదకూర్చుని రాచకార్యంలో మునిగి తేలుతున్న అరడజను వ్యక్తుల్లో అతనొకడు. అతను చినిగినకోటులో వున్నాడు. మాసిన బట్టలు, మాసిన గెడ్డం, అతనిదరిద్రాన్ని ఎత్తి చూపుతున్నాయ్. బీటలువారిన పొలం వానకోసం ఎదురుచూస్తున్నట్లు, అతని కళ్లు మంచి దశకోసం ఎదురు చూస్తున్నట్టున్నాయి.

మిగిలినవారుకూడా ఇంచుమించు అలాగే ఉన్నారు. అయిదేళ్ళక్రితం వారిని చూచినవాడెవడూ వారే వీరనుకోడు. కారణం? అది వసంతవృక్షం ఇది ఎండిన మోడు.

తనకంటె పెద్దదైన పేపర్లకట్టను సైకిలు వెనుకసీటులో పెట్టుకుని, పెద్దలు, సైకిలు పందెగాళ్ళు అయిన మిగతా పేపర్లమ్ముకునే కుర్రాళ్ళు తనను అధిగమించకుండా, రయ్యమని సైకిలు తొక్కుకుంటూపోతున్న పేపర్లబాయి సడన్ బ్రేకువేసి హోటలు ముందు నిలిచాడు.

'మెయిలు పేపరొకటి' అన్నాడు రమణ.

'డబ్బులివ్వండి' అని కుర్రాడు చెయ్యి చాచాడు.

'ఏం! పారిపోతామనుకున్నావా?' కొంచెం కోపంగా అన్నాడు రమణ.

'ఈ దబాయింపులకేం లెండి. పేపరు పుచ్చుకుని రేపురా, ఎల్లుండిరా అని తిప్పటం పరిపాటైపోయింది. అదంతా పనికిరాదు. నాకు ఆలస్యమైతోంది. అదిగో అప్పుడే వాళ్ళు వచ్చేశారు. డబ్బులుంటే ఇవ్వండి' అని ఓ క్షణం చూచి సైకిలెక్కబోయాడు.

'సుబ్బారావ్! ఓ అర్ధణా ఉంటే ఇవ్వరా!' అని అర్థించాడు రమణ.

అతను చిరాకుపడుతూనే యిచ్చాడు. తనవద్దనున్న అణాతో కలుపుకుని అరకాసు యిచ్చి మెయిలు పేపరు అందుకున్నాడు రమణ.

పేపర్లబాయి గాలిలో అస్త్రంలా సైకిలుమీద దూసుకుపోయాడు.

'ఏదీ ఓమాటు చూడనీ' అని చెయ్యి చాపాడు సుబ్బారావు.

'నన్ను ముందు చూడనియ్యి' అన్నాడు విసుగ్గా రమణ.

'మరి అర్ధణా యిచ్చింది ఉత్తపుణ్యానికేం?'

## ఆర్. యం. చిదంబరం

విసుగుగా సుబ్బారావు ప్రశ్నించేటప్పటికి రమణ చీకాకుపడుతూ 'నీకంటె నేను రెట్టింపిచ్చాను' అని అతని ప్రక్క కూర్చుని మెయిలు పేపర్లోని అన్ని కాగితాలూ అవతల విసిరిపారేసి 'సప్లి' ఉన్న కాగితం చేత పట్టుకుని అందర్నీ చూడమన్నట్లు కాగితం కొంచెం కిందుగా పట్టుకున్నాడు.

'ఇంతకీ పంతులు రాలేదే! క్లోజింగు ఏంవచ్చిందో తెలీటంలేదు' ఓపీ ఆఖరి దమ్ము పీలుస్తూ అన్నాడు సుబ్బయ్య. ఆ ఆరాటమే ప్రతివాడి హృదయంలోనూ వుంది. మరుక్షణంలో పంతులు హాజరయ్యాడు.

'మాటల్లోనే వచ్చేశాడు. నీకు నూరేళ్లు ఆయుష్షు' అన్నాడు ముక్కుపొడుం పీలుస్తూ శాస్త్రి.

'నా వల్లకాదు ఆయుస్సలాగే ఉంది. ఈ బ్రతుకు నూరేళ్లు కూడా బ్రతకాలా?' చిఱుబుఱులాడాడు పంతులు.

'ఇంతకీ క్లోజింగు ఏంవచ్చింది? ఆరేనా?' రమణ ఆతురతగా అడిగాడు.

పంతులు తాపీగా కూర్చుని 'కాదు ఎనిమిది. అందరూ ఆరే అనుకున్నారు' అన్నాడు.

అందరి మొహాల్లో కళాకాంతులు నశించాయి. సుబ్బారావు ఓసారి జుట్టు పీక్కున్నాడు. సంస్కారంలేని అతని జుట్టు ఇంకా అసహ్యంగా తయారయింది.

'అయితే నా పావలా గంగలో కలిసినట్టే!'

'నీ పావలా లెక్కేమిటి? నా రూపాయ్ మట్టికొట్టుకుపోయింది. ఎంత కష్టపడి సంపాదించిన రూపాయ్. ప్చ్ యోగంలేదు'

ఎవరివిచారం వారు వెలిబుచ్చారు.

'ఇదిగో.. ఎందుకలా విచారిస్తారు? ఆ లెక్కను నా సొమ్ము రెండురూపాయలు పోయింది. ఈ బ్రాకెట్టు ఆట అలాగే ఏడిపిస్తుంది. ముందు కొంతసొమ్ము లాక్కుంటుంది. అంతు తేలేదాకా వదలకుండా ఉంటే భాగ్యం తగిలిందన్నమాటే! మన వీరన్న ఆమేడ ఎలాకట్టించాడు?' అన్నాడు పంతులు.

బట్టలకొట్టు వీరన్న బ్రాకెట్టులో బోలెడు డబ్బు సంపాదించి మేడ కట్టాడని అందరినోటా వినవచ్చు. కాని లోగుట్టు పెరుమాళ్ళకెరుక.

తోటివారికి పంతులు ధైర్యం చెప్పకపోతే అతని పొట్ట ఎలా నిండుతుంది? కోటి విద్యలూ కూటికొరకే -

'సత్తెకాలి రెండూ ఆరూ బే రాయండి' బొడ్లోంచి బే కాసు తీస్తూ అన్నాడు శాస్త్రి.

'ఇంకా ఫోం చెయ్యలేదు. ఫోంచేసి రెండుగంటలకల్లా పుస్తకంపట్టుకునివస్తాను' అనేసి పంతులు చకచకా వెళ్లిపోయాడు.

'పేపర్లో ఏమిటి విశేషాలు?' అన్నాడు తాపీగా సుబ్బయ్య.

'పేపర్లో సంగతి మనకెందుకయ్యా!' రమణ కోపంగా అన్నాడు. డబ్బు పోయిందని అసలే కోపంగా వున్నాడు. ఇలా ఎన్నిసారులు నిరాశానలానికి దగ్గరైపోయి దరిద్రదేవత ఒడిలో పడలేదు?

'అదేనయ్యా మనసంగతే బొమ్మనుపట్టి వినున్నా ఆచోక్కి తీయగలవా?' అని తన అభిప్రాయం విడమర్చి చెప్పాడు సుబ్బయ్య.

'టకటాల తలుపు వేశాడు. దాని ప్రక్కల నేలమీద నిలువుపాటి గీతలున్నాయి. దీనినిబట్టి చూస్తుంటే డబ్లింగ్ రావాలి. అదీకాక డబిల్ వన్ రావటానికి ఆస్కారం ఎక్కువుంది. అంటే రెండు ఒకట్లన్నమాట' అన్నాడు రమణ. నిజానికి తనమాటమీద తనకి సంపూర్ణవిశ్వాసముంది.

'ఇక్కడ చాలామంది మనుష్యుల బొమ్మలు వేశారు దీనినిబట్టి చూస్తుంటే డబ్లింగ్ రాక తప్పదు' అని రమణను సమర్థించాడు సుబ్బారావు

'అదెలాగ?' మొన్ననే ఈ బ్రాకెట్టు ఆటలోకి దిగిన శాస్త్రి అన్నాడు

'ఒకేవస్తువును పదెపదేవేస్తే మరి దానర్థ మేమిటి?' అని సమాధాన మిచ్చాడు రమణ మనుష్యుల్నికూడా 'వస్తువుల' క్రింద జమ కట్టాడు

'వీడి ముక్కు ఒకవిధంగా చూస్తే ఏడులావుంది, కనుక ఏడు ఓపెనింగుకాని, క్లోజింగుకాని రావొచ్చు' ఇంతసేపూ మౌన వ్రతం అవలంబించిన అప్పారావు రిసెర్చి చేసి చెప్పాడు

'అలాంటివి చాలా వుంటాయ్' అని అంత కష్టపడి అప్పారావుచేసిన రిసెర్చిని తృణప్రాయంగా తీసి పారేశాడు రమణ

'సరేకాని ఎవరన్నా భూతద్దం పట్టుకొచ్చారా?' చింకి జేబులోంచి సుబ్బయ్య భూతద్దం తీసిచ్చాడు దాంతో రమణ ఆ 'కర్లీవీ' బొమ్మకేసి అరగంటసేపు తీక్షణంగా చూశాడు అతని ముఖంలో ఆ అరగంటలో అనేక రకాల ఛాయలు కనిపించి మాయమయ్యాయి అందరూ అతనికేసే చూస్తున్నారు

'డబల్ ఫైవ్ కూడా రావచ్చు అంటే రెండు అయిదులు ఒక బొమ్మ కాళ్ళదగ్గిర చిన్నగా రెండుఅయిదులు కనిపిస్తున్నాయి ఏమయినా డబ్లింగ్ తప్పదు' రమణ తుది నిశ్చయానికి వచ్చాడు

'ఇవేళ రెండూ ఆరు వస్తుందనుకున్నాం రాలేదు అదే రేపు వస్తుందని ఎందుకనుకోకూడదు?' శాస్త్రి అడిగిన ఈ ప్రశ్నలో నిజం లేకపోలేదన్నట్టు అందరూ అతనికేసి చూశారు

'నిజం డబ్లింగ్ మీద ఓ పావలా రెండూ ఆరు మీద ఓ బేడా కడతాను నేను' అని ప్రకటించాడు సుబ్బయ్య మిగతా వారుకూడా తగుతగు ప్రకటనలు చేశారు

'అసలు ఈ ఆట ఎలాగండి ఆడటం?' ఇందాకటినుంచి దూరంగా కూర్చున్న ఎలిమెంటరీ స్కూలు మేష్టరు అడిగాడు

'ప్రతిరోజూ రెండు అంకెలు వస్తాయి ఇవి బొంబాయినుండి వస్తాయి వాళ్ళకేమో అమెరికానుండి వస్తాయి ఈ అంకెలు అమెరికాలోని కాటన్ మార్కెట్టు ధరలట మీకుతోచిన అంకెమీద ఎంత డబ్బైనా కట్టొచ్చు ఆ అంకెలువస్తే మీరిచ్చిన సొమ్ముకు యాభైరెట్లు సొమ్ము మీకు ముడుతుంది మరి గారంటీ, మరి వదలరు' అని వివరించారు రమణ

మేష్టరు అర్థమైనట్టు తలూపి 'మీ యిష్టంవచ్చిన అంకెమీద ఓ బేడ రాయించండి' అని రమణ చేతికి బేడ కాసిచ్చి వెళ్ళిపోయాడు మేష్టరు

'అందులో ఏం రాసుందో కొస్త ఎవరన్నా చదివి వినిపిస్తే బాగుండును ఇంకా వెంకయ్యమేష్టారబ్బాయ్ రాలేదు' అని సుబ్బారావు చిన్నబోయాడు ఆ తోవనే వస్తున్న వెంకయ్యగారబ్బాయిని రమణ బ్రతిమాలాడు

'సుందరంగారూ! ఇది కొంచెం చదివి చెప్పండి రోజూ అడుగుతున్నానని మరి శ్రమ అనుకోకండి'

సుందరం తనకు ఇంగ్లీషు చదవటం వచ్చునని అందరికంకా ఓసారి గర్వంగా చూసి గోడకి జారబడి పేపరు అందుకున్నాడు

'ఇంతకీ ఇవేళ క్లోజింగేమిటి?' అనడిగాడు

'ఎనిమిది' అప్పారావన్నాడు

'రేపు ఏం వస్తుందనుకుంటున్నారు?'

'డబ్లింగ్ వస్తుందని అనుకుంటున్నాం రెండు ఒకట్లుకాని రెండు అయిదులుకాని రెండూ ఆరుకూడా రావచ్చు మరి మీరు చదివాక అభిప్రాయం మారితే మారాలి' మితభాషి అయిన అప్పారావన్నాడు

సుందరం అందులో వున్నది చదివి తనకు తోచిన విధంగా తెలుగులో అర్థం చెప్పాడు ఈ బ్రాకెట్టు ఆటతో సంబంధం లేనివాడు ఖర్మంచాలక అది చదివితే పేపరు చింపిపారేస్తాడు ఎవరన్నా చదువుతుంటే వింటే చదువుతున్న వాడి బుఱ్ఱ పచ్చడి చేస్తారు

'అస్తమానం గుడ్ గుడ్ గుడ్ అని వాడాడు దీనిని బట్టిచూస్తే డబ్లింగ్ తప్పదనిపిస్తోంది

తన వాదానికి బలమైన సాక్షులు దొరికినందుకు మురిసిపోయాడు రమణ

'మరి గుడ్‌లో రెండు సున్నలున్నాయి కనుక రెండుసున్నలు వచ్చేఅవకాశం ఎంతైనా ఉంది కనుక అన్నిటితోపాటు డబల్ జీరో కట్టటంకూడా మంచిది ఏమంటారు?' అని సుబ్బయ్య ఇతరుల ముఖాల్లోకి చూశాడు అందరూ అవునన్నట్లు తలవూపారు

'సుంద్రంగారూవున్న చెరువు బొమ్మ౦ది

రమణమ్మ : ఏమండీ ఒదినగారూ, మీ కోడలిని ఏమిటంత మరీ సాధిస్తున్నారు, రోజూనూ ?

నరసమ్మ : కాదండీ, తను అత్తగారయితే ఎలా ప్రవర్తించాలో ఇప్పటినుంచీ తరిఫీదు ఇస్తున్నాను

పి వి ఆర్ శ్యామలరావు, భుజిడి (బీహార్)

కనక జీరో ఓపెనింగుకాని క్లోజింగుకాని రావచ్చును అదీ కడతాను నేను' అని అప్పారావు ఇతరుల సలహాలేకుండా తన స్వంత కాళ్ళమీద నిలబడ్డాడు

'ఎందుకయ్యా మీకీబాధలు? గడిస్తున్న డబ్బుతో తిన్నపడిఉండలేరు ఈ సొమ్మంతా ఎందుకు ధారపోస్తారు? ఏదో కాటన్ మార్కెట్టట - మన సొమ్మంతా నాశనమై పోతోంది మీరు ఇకనైనా మానుకుంటే మనదేశం బాగుపడుతుంది ఈ వ్యసనాలలో తగులుకొని మీరు బాధపడుతూ కుటుంబాలను మాడుస్తున్నారు డబ్బున్నవాళ్ళను ఆడుకోనివ్వండి వాళ్ళకు వందలుపోయినా చీమ కుట్టినట్టైనా ఉండదు మీబోటి బీదలకెందుకీ వ్యసనం?' అని చిన్నలెక్చరు కొట్టాడు సుందరం కాని పంతుల్ని దారిలోనే అటకాయించి ఏదో అంకె రాయిస్తుంటాడు

'మరి ఇంతసొమ్ము ధారపోసి ఊరుకోమా? మా ఆస్తులన్నీ ఈ ఆటలోనే హరించిపోయాయ్ ప్రతిఫలం దొరికేవఱకూ వదలం' అని అందరి తరఫునా అన్నాడు రమణ

ఇంతలో పంతులు వచ్చాడు

ఒక్కసారి త్రేన్చి తాను భోజనం ముగించినట్టు అందరికీ తెలియజేసి సుఖానికి లోటులేకుండా గోడకి జారబడి నేలమీద కూర్చుని అంకెలువ్రాసే తన చిన్న పుస్తకాన్ని బయటకు తీశాడు

పంతులు చేశ యివ్వబోయాడు

'ఉండండి కార్బను పేపరయిపోయింది సుబ్బారావ్! ఓ కార్బను పేపరు తెచ్చిపెట్టవూ?' అని ఆజ్ఞయిచ్చాడు ఫర్లాంగు దూరంలోవున్న ఫ్యాన్సీషాపుకు సుబ్బారావు వెళ్ళాడు

'రేపు ఏం వస్తుందంటారు?' అని పంతుల్నడిగాడు శాస్త్రి ఈ వ్యవహారంలో

పంతులు అందరికంటె ఆరితేరిన వాడని అందరి నిశ్చితాభిప్రాయం

'డబ్లింగ్ గన్‌షాట్ - రెండూ ఆరుకూడా'

'అద్దదీ - నే చెప్పలా !' అని శాస్త్రి, రమణ ఒక్కసారే అన్నారు

అప్పారావు జేబీలోంచి డబ్బులుతీసి లెక్క పెట్టుకున్నాడు అరణాలు న్నాయి. మళ్ళీ జోబీలో పడేసుకుని కిళ్లీ దుకాణానికి వెళ్ళాడు

'ఓ బీడీ కట్టిద్దూ ?' అన్నాడు బ్రతిమాలుతూన్న కంఠంతో.

'డబ్బులు ?' అనడిగాడు యజమాని

'రేపు తప్పకుండా ఇస్తాను మొన్న పావలా బాకీగా - అదీఇదీ కలుపుకుని ఇస్తాను బాబ్బాబు ఈ ఒక్కసారి' అతని కంఠంలో ఎంతైనా జాలుంది

'హాఁ బ్రాకెట్లకు పెట్టమంటే ఎంత సొమ్మైనా వస్తుంది సొంతఖర్చుకి అప్పు చెయ్యాలి వెళ్ళవయ్యా - ఇలాటి బేరాలొస్తే వ్యాపారం సాగినట్టే' అని కసిరికొట్టాడు యజమాని అప్పారావు చేసేది లేక తిరిగి వచ్చాడు.

'ఇంకా సుబ్బారావు రాలేదు !' అని విసుక్కున్నాడు పంతులు అతనికి బదులుగా సూర్యారావు వచ్చాడు రాగానే,

'పంతులుగారు !, మూడు ఎనిమిదిమీద పదిహేనురూపాయలురాయండి' అన్నాడు

అందరూ ఆశ్చర్యపోయారు !

'కార్బను పేపరుకోసం సుబ్బారావెళ్ళాడు వస్తాడు కూర్చోండి' అన్నాడు పంతులు

'మూడు ఎనిమిది ఖాయమేమిటండి ?' అనడిగాడు రమణ

'ఆ తప్పకుండా రావాల్సిందే లేకపోతే ఎందుకు కడతాను ?' అని ఎదురు ప్రశ్న వేశాడు సూర్యారావు

సుబ్బారావు కార్బను కాగితంతో వచ్చాడు

పంతులు చకాచకా దాన్ని మడిచి పరపర ముక్కలుగా చింపి పుస్తకంలోఉంచి సూర్యారావుకు మూడు ఎనిమిదిమీద పదిహేను రూపాయలురాసి సంతకం పెట్టి రసీదు ఇచ్చాడు మూడు అయిదు రూపాయల కాగితాలూ అందుకున్నాడు

రమణ అర్ధరూపాయందించి 'మూడు ఎనిమిది' అన్నాడు అంతసేపూ ఆలోచించి నిర్ణయించిన డబ్లింగ్ ఏమయిందో! అందరూ ఆపనే చేశారు ఆఖరుకు పంతులుకి కూడా మతిపోయి తనపేర మూడు ఎనిమిదిమీద అర్ధరూపాయి రాసుకున్నాడు

'అప్పుడూ ! ఓ సైకిలు సిద్ధం చెయి' అని గట్టిగా ఎదురుగావున్న సైకిలుషాపు కుఱ్ఱాడికి ఆర్డరు వేశాడు

అన్నీ సర్దుకుని బయలుదేర బోయేటప్పటికి ఎట్నుంచోవీ ప్రత్యక్షం బ్రాకెట్టుఆట ప్రభుత్వ చట్టరీత్యా నిషిద్ధం కాని మిగతా నిషిద్ధ చట్టాల్లాగే ఇదికూడా అఘోరి స్తోంది పంతులు అర్ధరూపాయి కాసు పోలీసు చేతిలో పెట్టగానే అతను సంతోషించి తనదారిన పోయాడు అప్పుడు సైకిలుకు గాలికొట్టి తేగానే డబ్బు జమకట్టి



# స్వర్గానికి నిచ్చెన



డుకు పోస్టాఫీసుకు సైకిలుమీద తుర్రుమన్నాడు

'నాన్నా! అమ్మ బియ్యం కొనుక్కురమ్మంది' రమణ కొడుకు రొప్పుకుంటూ రొజుకుంటూవచ్చి చెప్పాడు

'పోరా వెధవా! డబ్బులెక్కడేడి కాను తేరగా తినటానికి అంతా తయారు! మీఅమ్మను ఎక్కడన్నా బదులడగమను' అని కోపంగా అన్నాడు

'తిండికి తయారు బియ్యం ఎలా వస్తుందో' అనుకుని రమణకొడుకు విధిలేక వెనక్కి తిరిగాడు

తమకు రాబోయే ధనరాసుల్ని, ఉజ్వల భవిష్యత్తును తలచుకుంటూ, ఆనందిస్తూ, స్వర్గానికి నిచ్చెనవేస్తూ అందరూ విడిపోయారు

ఒక్కడన్నా, అరకప్పు కాఫీయన్నా తాగలేదని హోటలు ప్రొప్రయిటరు ఆ గుంపుకేసి కోపంగా చూశాడు అంతకంటె ఏం చేయగలడు? రావొద్దంటే అంతాకలిసి తంతారేమోనని భయం - అదొక కూటమి

మరునాడు ఉదయం అందరూ హోటలు అరుగుమీద సమావేశమయ్యారు పంతులుకూడా ఆలస్యం చేయకుండా వచ్చాడు

'ఓ పెనింగెం'టని అందరూ ఆత్రంగా ప్రశ్నించారు పంతులుకళ్ళు సూర్యారావు కోసం వెదికాయి కానతను ఎక్కడా కనిపించలేదు అంతడబ్బు కట్టిన వాడికి కొంచెమయినా ఆసక్తి లేదేమని పంతులు ఆశ్చర్యపోయాడు

'మూడు' అన్నాడు అందరూ ఎగిరి గంతేశారు ఇక క్లోజింగు 'ఎనిమిది' తప్పదన్నారు సూర్యారావు అదృష్టాన్ని అభినందిస్తూ అంతా కూర్చున్నారు తొమ్మిదింటకి క్లోజింగు ఎనిమిదని తెలిసింది అందరూ ఆనందంతో గుర్తుతేలేసినంత పని చేశారు అమితానందంతో డబ్బు రిసీవ్ చేసుకోటానికి పంతులు సైకిలెక్కాడు పంతులుకి కూడా ఛాన్సు తగిలిందిగా!

అంతాకళ్ళి సూర్యారావుకు ఈ సంతోషవార్త చెప్పి సాయంత్రం టీపార్టీ యిమ్మని కోరారు అతను సరేనన్నాడు

డబ్బు ఇచ్చేటప్పుడు పంతులికీ మిగతావారికి తగాదావచ్చింది

'నలభైరెట్లే ఇస్తాను' అంటాడు పంతులు

'మామూలుగా యాభైరెట్లిస్తావు - పదిరెట్లు పోగొట్టుకుంటామా? యాభైరెట్లు ఇచ్చి తీరాల్సిందే!' అని మిగతవారంటారు

'వాళ్ళు నలభైరెట్లే ఇచ్చారు నేనెక్కణ్ణుంచి తెచ్చేది?' అంటాడు పంతులు

'పంతులు మోసంచేసి పదిరెట్లు కాజెయ్యాలని ప్రయత్నిస్తున్నాడ'ని మిగతవారు గుసగుసలాడుకున్నారు

రమణ 'సరి! పోనిద్దురూ! వచ్చిందే తీసుకోండి' అని ఆఖరికి సమ్మతించాడు డబ్బు ఇవ్వటం పూర్తయింది

'సూర్యారావు రాలేదే!' అనడిగాడు అప్పారావు

'అతను ఇందాకనే డబ్బు పుచ్చుకున్నాడు'

'మరయితే రేపు ఏం వస్తుందంటారు' శాస్త్రి యథారీతిగా అడిగాడు

మధ్యాహ్నంనుండి 'కర్లీఫ్' చూస్తున్న రమణ 'నాలుగూ మూడురాక తప్పదు' అన్నాడు

'నా అభిప్రాయం కూడా అదే! నాలుగూ మూడు గన్‌షాట్ ఈ సారి బొమ్మలో నాలుగంకెలు ఎక్కువున్నాయి అయినా రెండూ ఆరును వదులుకూడదు' అన్నాడు పంతులు 'నాలుగూ మూడు మీద పావలా రాయండి' అన్నాడు శాస్త్రి అదే అభిప్రాయంతో మిగతావారు కూడా తాము కట్టదలచుకున్న డబ్బు పైకి తీశారు

సూర్యారావింతలో ఆదరా బాదరాగా వచ్చి 'ఆరూ తొమ్మిదిమీద ఇరవై రూపాయలు రాయండి' అన్నాడు మిగతా వారంతా చేతులు వెనక్కి లాక్కున్నారు పంతులు రాసిచ్చి రెండు పదిరూపాయల కాగితాలు పుచ్చుకోగానే సూర్యారావు అందరివంకా తిరిగి 'ఏడుగంటలకు టీపార్టీకి రండి' అనేసి చక్కాపోయాడు

'ఆరు తొమ్మిది రూపాయ్ రాయండి' అన్నాడు శాస్త్రి మిగతావారు అతన్ననుసరించారు 'నలుగురితోపాటు నారాయణా' అని పంతులుకూడా ఆ అంకెమీదే రూపాయి కట్టాడు

మరునాడు ఉదయం అందరూ 'హోటలు అరుగుమీద చేరుకున్నారు పంతులువచ్చి ఓపెనింగు నాలుగు' అన్నాడు అందరి గొంతుల్లోను పచ్చి వెలక్కాయ పడ్డట్టయింది ఈ లోపల కాఫీ త్రాగుతూ ఈ మాటలువిన్న సూర్యారావుకు గొంతులో కాఫీ దిగక చరచర వెళ్లిపోయాడు

మధ్యాహ్నానికి క్లోజింగుకూడా తెలిసింది ఆనాటి బ్రాకెట్టు నాలుగూ మూడు

'అరెరె! ఎంత పని జరిగింది! సూర్యారావును చూచి మోసపోయాం' అన్నాడు రమణ

'ఇంతకే మనకి అదృష్టముండొద్దూ? అది లేనివాడు అమృతం రాసుకుని దొర్లినా ఇసుకంటుకోదు' అని సామెతొకటి పారేశాడు శాస్త్రి

సూర్యారావుకి నిజంగా తల తీసేసినట్లయింది పట్టుదలకొద్దీ డబల్‌వన్ మీద 30 రూపాయలు కాశాడు

మరునాడు 'ఆరూ తొమ్మిది' బ్రాకెట్టు వచ్చింది! అతను ఇంటికెళ్ళి నెత్తి మోదుకు నేడ్చాడు! అయినా అంటుజాడ్యం వదలుతుందా? ఏనాడైనా ఒక్క రాయితే గులక పోతుందా? అని ఆశ

మిగతావాళ్లు తమ కుటుంబాలను మాడ్చి, స్వంత ఖర్చులు తగ్గించుకుని డబ్బు ప్రోగు చేసి బ్రాకెట్టుకు దానంచేసి నానాటికీ విశాఖపట్నం ప్రయాణానికి తయారవుతునా న

కాలచక్రం గిరగిర తిరుగుతోంది

కొంత కాలానికి సూర్యారావు కాలవలో పడి ఆత్మహత్య చేసుకున్నాడు కారణం ఆ కూటమికీ, చచ్చి నతనికీ తప్ప మరెవరికీ తెలియదు

రమణ ఏవ్వూగో పారిపోయాడు

భుక్తికి లోటులేకుండా బ్రతికిన శాస్త్రి ఎట్టిట రాగిపాత్ర చేతపట్టుకుని 'భిక్షాం దేహి' అని వీధివెంట బయలుదేరాడు

సుబ్బయ్య కాఫీహోటలు సెర్వరయ్యాడు

అప్పారావు రిక్షా లాగటం మొదలెట్టాడు

ఎలిమెంటరిస్కూలు మేష్టరు ఆటబాగా మరిగి డబ్బు తగలేస్తున్నాడు

పంతులు తెలివైనవాడు కనుక కారు డ్రైవింగ్ నేర్చుకుని డ్రైవరుగా పనిచేస్తూ పొట్ట పోషించుకుంటున్నాడు

మొత్తానికి వ్యసనాల మూలంగా బ్రతుకుల పతనం సంభవించింది అయితే ఏం! బ్రాకెట్టు ఆటకు ఏమీ అగౌరవం కాని, అన్యాయం కాని జరుగలేదు పంకన్న పంతులు వదలి వేసిపోతే, రామన్న పంతులు కార్యక్రమాలను యథాతథంగా నడిపిస్తున్నాడు రమణ, సుబ్బారావులాంటివాళ్ళకి మరికొందరు చేరారు ఈసారి ఎలిమెంటరీ స్కూలు మేష్టరుది అనుభవహస్తం వాళ్ల లోటును వీళ్లు భర్తీ చేస్తున్నారు

'వాళ్లుకూడా రమణ, సుబ్బారావు, తదితరుల్లాగ అధోగతిపాలై తేనో?'

అనే ప్రశ్న జనించవచ్చు

దానికొక్కటే సమాధానం -

'ఇగా స్వర్గానికి నిచ్చెన వేసేవాళ్ళకు దేశం గొడ్డుపోలేదు కాయకష్టం గాని జీవిత శిఖరాన్నందుకోటానికి సంగుత్రోవ ఉందని భ్రమపడి దానికోసం ప్రాకులాడే వాళ్ళు ఎన్ని కోట్లమంది ఉన్నారో!'

వ్యసనపాశం అలాంటిది ★



# విజ్ఞానవీధులు

## "డాక్టర్"



## 149. మొగానికి పసుపు రాసుకొంటే ప్రయోజనాలు ఏమైనా ఉన్నాయా?

భారతదేశంలో పసుపూ, కుంకమూ అయిదువతనానికి చిహ్నాలుగా ఉన్నాయి. ఐతే, 'అవి కేవలం అందాన్ని ఇనుమడింపచేసే సౌందర్యపోషకపదార్థములేనా? లేకపోతే, వాటివల్ల మరే ప్రత్యేక ప్రయోజనమేమైనా ఉందా?' అని ఎవరేనా అడిగితే ఉందని చెప్పవలసివస్తుంది

పసుపుయొక్క ప్రాముఖ్యం అందులో ఉన్న రసాయనిక పదార్థాలనుబట్టి నిర్ధారణ అయింది. వైజ్ఞానికులు పసుపులో ఎక్కువగా పిండిపదార్థాలూ, పెక్టిన్‌లూ, సెల్యులోజూ, కొద్దిగా వృక్షనిర్యాస పదార్థాలూ (*Resinous substances*), నూరింట 1 5—5 5 పాళ్లు పరిమళ తైలమూ, కర్క్యుమిన్ (*Curcumin*) అనే పసుపుపచ్చని రంగు పదార్థమూ కలిసి ఉన్నాయని రుజువు చేశారు. పిండిపదార్థాలు పేశల స్థితిలో (*Gelatinous*) ఉన్నాయని కూడా తెలుస్తోంది. అందుచేతనే పసుపు రాసుకున్న ముఖం మృదువుగా ఉంటుంది. ఇక పరిమళ తైలంవల్ల సహజమైన పరిమళమూ, కర్క్యుమిన్ అనే పసుపుపచ్చనిరంగువల్ల పదార్థాన్ని పసిమిరంగూ కలుగుతాయన్నది విస్పష్టమే. పసుపుయొక్క ప్రత్యేక ప్రయోజనం కర్క్యుమిన్‌యొక్క రాసాయనిక లక్షణాలవల్ల కలుగుతోంది. అది రాసాయనికంగా ఫినోలుల వర్గానికి చెందుతుంది. కార్బాలిక్ ఆసిడ్ ఆ జాతికి చెందినదే. అది మంచి ధాటయిన క్రిమిసంహారి. ఈ సంగతి కార్బాలిక్ సబ్బు వాడిన వారందరికీ తెలిసినవిషయమే. ఐతే, పసుపులో ఉన్న కర్క్యుమిన్ మాత్రం ఫినోలుఅంత ధాటయింది కాదు. అందుచేతనే అది అతి మృదువై నొప్పింపక తానొవ్వక పనిచేసే క్రిమిసంహారులలో ఒకటి అనాలి. ఇలాంటి వనోషధి లేవు. అంతే కాదు ఈ లక్షణం యొక్క ప్రాముఖ్యాన్ని అర్థంచేసుకోవాలంటే మనం క్రిమిసంహారులను గురించిన ఒక సామాన్య విషయం తెలుసుకోవాలి. వైద్యంలో మానవదేహాలను ఆశ్రయించుకొన్న సూక్ష్మ క్రిములను నాశంచేసే పదార్థాలే ముఖ్యంగా అవసరం అవుతూంటాయి. అందుకోసం మరీ ధాటీయైన క్రిమి సంహారులను వాడితే దాటి కాశ్రయదాతలైన వారికి కూడా ముప్పం కలుగుతుంది. అలాగని వెనకాడి మరీ ధాటీ తక్కువైన పదార్థాలను కనక వాడితే, నశించవలసిన సూక్ష్మ క్రిములన్నీ పూర్తిగా నశించవు. అందుచేతనే క్రిమిసంహార పదార్థాలను ఎన్నుకోవడంలో వైద్యులు క్రిమి శాస్త్రవేత్తలయొక్క రసాయన శాస్త్రవేత్తలయొక్క కృషిమీద ఆధారపడుతారు. ఇంక మనం తిరిగి పసుపుసంగతి ఆలోచిద్దాము. అందులో ఉన్న కర్క్యుమిన్ చర్మరోగాలకు కారకములైన కొన్ని సూక్ష్మజీవుల్ని నాశం చేయుగలదు. దాన్ని వాడినప్పుడు చర్మం పెట్టపోగు కర్క్యుమిన్ చెమటని ఆర్పివేస్తుంది. అందుచేత మొగంమీద మొటిమలు మొదలైనవి లేవకుండా కాపాడుతుంది. మొత్తంమీద పసుపు కేవలం సౌందర్యపోషక పదార్థం మాత్రమే కాదనీ, ఉద్దేశపూర్వకమైనది కాకపోయినప్పటికీ మంచి చర్మరోగ నివారిణి అనీ మనం భావించవచ్చు. ఇక కుంకుమ కూడా ఇలాంటిదే అన్న విషయం, దాన్ని తయారుచేసే విధానాన్ని బటి తెలుసుకోవచ్చు. మంచి చాయపసుపు కొమ్ములికి ఎరుపు రంగు కలిపి కొట్టి కుంకం తయారు చేస్తున్నారు

పసుపులోఉన్న పదార్థాల స్వభావాన్ని మన పూర్వులు గుర్తించారో యేమో చెప్పలేము. కాని మనవారు పసిపిల్లలను పోరుకాడించి, హారిరక్ష అని మాడుపట్టున పసుపు అద్దే ఆచారం తగుమాత్రంగా వంటకాల్లో పసుపుని వాడటం సదాచారాలనీ అవశ్యంగా అనుష్ఠేయములనీ అనిపిస్తుంది. ఇవే కాదు మోతాదుగా పచ్చిపసుపుని మందుగా వాడటంవల్ల మధుమేహరోగుల రోగతీవ్రత తగ్గుతుందని నేను విన్నాను. ఒకరిద్దరి విషయంలో అది నిజం కావటం నేను కన్నాను.

పసుపుయొక్క ఉపయోగాల్ని అందులో కర్క్యుమిన్‌ను గురించీ రసాయనికులూ, వైద్యులూ కూలంకషంగా పరిశోధించవలసి వుంటుంది. మనకి అతి పరిచితమైన పసుపుయొక్క గుణగణాలన్ని మనకి అవగతం కానేలేవనాలి

—హరి.

## చిట్టి ప్రశ్నలకు జవాబులు

—మోటారు బేటరి స్క్రూల్లలో ఒకదానికి రాగితీగ తగిలించి తీగ రెండోకొసని రెండో స్క్రూకి రాస్తే కరకరమనే



మెరుపు ఆకాశములోని మెరుపులాంటిది కాదు ఆకాశములోని మెరుపు మబ్బుకి నూమికి స్పర్శ లేకుండానే, విద్యుత్పీడనమువల్ల కలిగిన మెరుపు ఈ మెరుపు గాలిని భేదించుకుంటూ ప్రసరిస్తుంది కనక ఆకాశపు మెరుపు వెల్తురులో గాలిలో ఆమ్లజనీ, నత్రజనీ గుణములు కనబడతాయి. వేరేరీతిగ ఆ పిడిలో ముందు స్పర్శ ఉంటుంది ఆప్పుడు విద్యుత్ప్రవాహము కోరుగా ప్రవహిస్తుంది తీగని వేరు చేసినప్పుడు ఈ ప్రవాహము సాగుతూ నేవుండాలన్న ప్రయత్నంలో మెరుపు వస్తుంది పైన చెప్పిన చుణుకుకంటె ఈ కరకరయొక్క అసలు తత్వమే మెత్తన ఈ మెరుపు వెలుగులో గాలిగుణాలు చాలా తక్కువ ఉన్నవన్నీ తీగెయొక్కా, స్వాప్రియొక్క లోహానివే

—సూర్యునిలోని ఉదజని హీలియముగా మారడమువల్ల నే సూర్యుడు వెలుగుపొందిన ప్పైతే, సూర్యుడినుండి విడిపడ్డ గ్రహగోళాలలో అలాంటి మార్పే కలిగి, అవి ఎందుకు మండడము లేదూ? అంటున్నారు విజయనగరంనించి జె వి సూర్యంగారు సూర్యగోళంలో నడిమిభాగములో ఒత్తిడి బ్రహ్మాండముగా ఉండి, అక్కడ ఉదజని పుక్కుకుపోయి మారిపోతోంది గ్రహగోళాలు సూర్యుడి పైభాగపు వాయువులనుండి ఏర్పడినవి ఈ భాగాలే పెద్ద గ్రహాలుగా విడివడ్డాయి అందువల్ల సూర్యుడి కేంద్రదేశమందు జరిగే రాసాయన క్రియలు కొంటె అల్పపీడన పరిస్థితులలో జరగడానికి వీలుంటుందా? భూమినించి విడిపోయిన చంద్రుడు భూమికంటె త్వరగా చల్లారిపోలేదూ? చంద్రుడు కూడా భూమి పైపొరలనుంచే ఏర్పడ్డాడనీ, చంద్రుడు ఖాళీ చేసిన 'గొయ్యియే' పసిఫిక్ మహాసముద్రమనీ శాస్త్రజ్ఞులంటారు

— శ్రీ గంట లక్ష్మీనారాయణగారికి 17-6-53 తేదీ విజ్ఞానవీధులలో మేము వ్రాసిన "వారాల మంచిచెడ్డలు" అన్న వివరణను 'ఖండిస్తూ' మీరు రాసిన 8 పుటల వ్యాసము చేరినది వారాల మంచిచెడ్డలను గురించి మీరు చెప్పిన విషయాలివి "గ్రహములను మందగతివాటనుంచి శీఘ్రగతివాటికి వరుసగా వేస్తే, శని, గురు, కుజ, రవి, శుక్ర, బుధ, చంద్రులు వస్తారు ప్రాచీనులు దినములకు గల గంటలమీద గ్రహములకు ఆధిపత్య మిచ్చినారు రవి వారమునా డుదయము సూర్యోదయానంతరము మొదటిగంటకు రవి అధిపతి కనక ఆ దినమున కు రవి వారమని పేరు వచ్చినది తరువాతి 23 గంటలకూ గ్రహాల్ని పంచితే, 24 వ గంటకు, అనగా మర్నా డుదయము మొదటి గంటకు చంద్రుడు అధిపతి అవుతాడు కనక ఆనాటికి సోమవారము అన్నారు. ఈరీతిగా లెక్క వేస్తూపోతే వారాలన్నిటికీ మొదటి గంటకు అధిపతి అయిన గ్రహముపేరు వచ్చినట్లు తెలుస్తుంది. (2) గ్రహములకు ఉచ్చనీచములు—మంచిచెడ్డ లున్నాయి కనక ఆ గ్రహములు ఆధిపత్యము చేసేవారాలకూ ఉన్నాయి" అని

ఈరెండిటిలో మొదటివిషయము మేమూ వివరించాము వివరించి "మరి యీ పద్ధతిలో మంచిచెడ్డ లేమున్నాయీ?" అని అడిగేము, అపును ఏమున్నాయీ? జనవరి ఒకటవ తేదీ రవివార మనుకున్నా, రెండవ తేదీ రవివార మనుకున్నా, మూడవ తేదీ రవివార మనుకున్నా, ఏడు వారాలూ ఇప్పటిలాగే తిరుగుతాయి ఆదిలో ఏదో ఒక రోజుని పట్టుకుని దాన్ని రవివార మనేశారు దానినుంచి తక్కిన వారాలు వచ్చాయి రవి వారానికి రవికీ, హోరాధిపత్య మిచ్చిన మహానుభావుడు తాటాకుల మీద కలిపిన సంబంధము తప్ప సృష్టిలో ఏ సంబంధమూ లేదు తిథినీ నక్షత్రాన్నీ చెప్పుకున్నట్లు, గ్రహాలనీ నక్షత్రాల్నీ చూసి వారాన్ని, చెప్పగలరా మీరు? వారాన్ని గ్రహవేధవల్ల తెలుసుకున్ననాడు, వారానికీ గ్రహానికీ సంబంధమున్నట్లు నమ్మవచ్చును గాని, లేనప్పుడు హోరాధిపత్యాన్ని బనాయించిన 'శాస్త్ర' కారుడి వాక్యము మీ 'బూటకమే' కాదూ?

వారాలపేర్లు గ్రహాల పేర్లుగా ఎందుకు పెట్టారని కాదు మా ప్రశ్న ఈ పెట్టిన పద్ధతికి గ్రహాలకి సంబంధము సృష్టిలోనిది కాదుకదా, మరి జ్యోతిష్కులు కల్పించినదే కాదా? అని ఎవరో ఒకరు కల్పించిన సంబంధాన్ని గ్రహాలు చేతులు కట్టుకుని పాలించేస్తాయా అని

రవి వారమునాడు మొదటి హోరకు రవి అధిపతి అనడానికి ఆధారము రవికాదూ? రవివారమే కాదు, ఏ ఒక్క వారమునకేనా సరే ఆ ఒక్క గ్రహముతో సంబంధమును నిరూపిస్తారూ? గ్రహాలకీ ఆ వారాలకీ గల సంబంధానికి ఆధారము శాస్త్రము మాత్రమేనా, గ్రహాలు కావూ? శాస్త్రము అంటున్నది 'రవి వారమునాడు మొదటి గంటకి 'రవి అధిపతి' అని నిజమే గ్రహాన్ని చూచి అడిగితే గ్రహము మాట్లాడగలిగితే, 'మిత్రో, నాకు వారాలపేరుతో ఏమీ సంబంధము లేదయ్యా, మీ శాస్త్రకారుడి బనాయింపు అది' అంటుంది మీ వారముల పేర్లకీ గ్రహాలకీ నిజముగా సంబంధమే వుంటే అది ఆ వారాలనాడు ఆ ప్రత్యేక గ్రహాల గతులలోనో, స్థానాలలోనో ఎందులోనో కనబడాలి గాని 'శాస్త్రము' లో కాదు కనబడడము

అయితే మరి 'బూటక పరిచయము' 'బెంకాయ పిచ్చికొండ' 'అసంపూర్ణ విమర్శ' మాదేనంటారా? ★



పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి






























పదవి దొరకుటే తడవుగ నక్క - గర్వాంధుండై కన్నుగానక - మిడిసిపాటులో మిగిలిన మృగముల- పీడించుట మొదలెట్టినది -జంబుకాధముని పరిపాలన మిక- భరించలేకను మిగిలిన నక్కలు- ఒకనాడొకచో సమావేశమై - దీర్ఘంగా చర్చించినవి







అని యా ముదుసలి జంబుకమేదో- పన్నాగం తన మిత్రులతోటే - రహస్యముగ చర్చించినది -



# సంధి-విగ్రహం

కథ - విశ్వాత్ముల నరసింహమూర్తి



































# గణపతి



గణపతి రాధాకృష్ణమూర్తి

దేవు లందరిలోన ఆది దేవుడవయ్యా
అందుకో వందనము ఓ బొజ్జ గణపతీ!

విఘ్న మన్నది లేక నిర్విఘ్నమైనటి
ఘనమైన జ్ఞానమిడు విఘ్నేశ్వరయ్యా!

ఘాతాలు లేకుండ మా భరతజాతి
ఖ్యాతిగా బ్రతికించు దంతాల దేవ!

గుండ్రనీ ఉండ్రాళ్లు దండిగా మ్రింగి
కడుపునిండా కూడు మా కెట్టు తండ్రీ!

గోదావరీ వరద బాధితుల నందరిని
నేర్పుగా రక్షించు కరితొండమయ్యా!

త్వరలోన వెలువడు మా యాంధ్రరాష్ట్రమును
వర్థిల్ల జేయుమో ఉండ్రాళ్ల దేవా!

మాకున్న నాయకులు తిండిలో వినాయకులు,
కాక, బుద్ధిలో వినాయకులు చేయుమో నాయకా!

సిరిసంపదలు గజ్జ కట్టి యాడిన భూమి
ఇనుపగజ్జలతల్లి జొరనీయకో మరిగుజ్జ!

దేవులందరిలోన ఆది దేవుడవయ్యా
అందుకో వందనము ఓ బొజ్జ గణపతీ!



## అద్దెబోటులో-

# ముచ్చటగా ముగ్గురు

## (కుక్క సంగతి సరే సరి!)



'వార్‌గ్రేవ్' దగ్గర థేమ్స్ నదికి ఒక చిన్న పాయ వున్నది. అందులోగుండా పోతే 'మార్షల్ లాకు'కు చాలాదగ్గర. దారిపొడుగునా ప్రకృతి కూడా చూడ ముచ్చటగా వుంటుంది. మా పడవని ఆదారినే పట్టించాం.

నదిపాయ చీలేచోట 'హద్దుమీరి నడిచేవారు శిక్షింపబడుదురు' అని అనేకమైన బోర్డులు తగిలించి వున్నాయి నేలని ఎక్కడికక్కడ చిన్నచిన్న చెక్కలుగా చేసి వాటిచుట్టూ కంచెలూ ముళ్లతీగలూ వేసి వుంచారు. ఆ బోర్డులమీద రాసిన రాతల ధోరణిబట్టి చూస్తే, యిక్కడ గాలి పీల్చినవాళ్లని కూడా యీ భూస్వాములు పట్టుకొని పీడించేలా వున్నారని పించింది. అన్నిబోర్డులు వున్నా, వాటిని లెక్కచేసే దెవరు? ఎవరూ చూడకుండా వున్నప్పుడు అందులో అరడజను బోర్డులు పూడపీకి నదిలో పారేసినా అడిగే దిక్కు వుండదు.

పాయమీదగా సగందూరం ప్రయాణంచేసి అక్కడ మధ్యాహ్న భోజనాలకిగాను బోటుకి లంగరు వేశాం. ఆ సందర్భంలోనే నన్నూ, జార్జిని నిశ్చేష్టులుగా చేసిన సంఘటన ఒకటి జరిగింది. ఆ సంఘటన మూలంగా హారిస్సుకూడా కంగారుపడ్డాడు కాని, నేనూ జార్జి పడ్డంత తీవ్రంగా మాత్రంకాదు.

ఇంతకీ జరిగిందేమిటో తెలుసా?—ఏటి అంచుకి పదిగజాలదూరంలో పచ్చిగడ్డిమీద మేము ముగ్గురమూ కూర్చుని వున్నాం. హారిస్సు మాంసం రొట్టె తీసి వొళ్ళో పెట్టుకొని కత్తితో ముక్కలుముక్కలుగా కోస్తున్నాడు. ఆ ముక్కలకోసం మేము యిద్దరమూ చెరొకప్లేటూ పట్టుకొని సిద్ధంగా కూర్చున్నాం.

"ఏదైనా ఒక చెంచా వుందా అక్కడ—కొవ్వు తీయాలి?" అని హారిస్సు మమ్మల్ని అడిగాడు.

సామానునంచి మా వెనగ్గా వుంది. నేనూ జార్జి యిద్దరమూ వెనక్కి తిరిగి చెంచాకోసం, సంచిలోకి చేతులు పోనిచ్చి వెతుకుతున్నాం. అంతా ఐదు సెకండ్లు గడిచేలోగా చెంచా చిక్కింది. ఇటు తిరిగాం. తిరిగిచూస్తే ఏముందీ—హారిస్సూ లేడు; మా నోరు వూరించిన రొట్టా లేదు!!

మేము కూర్చున్నది పెద్దబయలు. ఆ చుట్టుపట్ల వందగజాలలోపు ఎక్కడా ఒక చెట్టుకాని, పుట్టకాని లేదు. అంచేత వాడు దేనిచాటునైనా దాక్కున్నాడేమో అనుకోవటానికి ఆస్కారం లేదు. పోని — నదిలో పడిపోయాడేమో అనుకొందామా అంటే, నది, మేము కూర్చున్న చోటుకి వెనుకభాగాన వుంది. అంటే మా ముందు కూర్చున్న హారిస్సు ఏకారణం చేతనైనా, నదిలోకి దూకెయ్యదలచుకొంటే,

మూలం :
జెరోమ్ కె. జెరోమ్

అనువాదం :
విశ్వాత్ముల నరసింహమూర్తి

 

# ముచ్చటగా ముగ్గురు



ముందుగా మా యిద్దరి తలలమీదనుంచే దాటి పోవాలి. అటువంటి దేమీ జరగలేదు కాబట్టి, వాడు నదిలో పడివుంటాడని అనుకోవటానికీ వీల్లేకపోయింది.

నేనూ జార్జి కంగారుగా మైదానమంతా కలయ చూశాం: ఒకళ్ళ మొఖం ఒకళ్ళం చూసుకొన్నాం.

"మన హారిస్ని ఎవరైనా బొందితోటే స్వర్గానికి ఎత్తికెళ్లారంటావా?" అని జార్జిని అడిగాను.

"పోనీ వాడినైతే తీసుకుపోయారన్నా నమ్మవచ్చుకాని, రొట్టెనుకూడా పట్టుకుపోతారంటావా?" అని వాడు నన్ను అడిగాడు.

వాడు వెళ్లబుచ్చిన అనుమానం చాలా సబబుగా వున్నట్లు తోచింది అంచేత హారిస్ స్వర్గారోహణం చేసివుంటాడేమోననే అభిప్రాయాన్ని మా మనస్సుల్లోనుంచి పూర్తిగా కొట్టిపారేశాం.

"అసలు ఒకటి జరిగివుంటుందిరా! ...భూకంపం ఏమైనా వచ్చిందేమో?" అన్నాడు జార్జి స్వర్గంనుంచి సాదా సంగతులవిషయానికి వస్తూ

మరి కొంతసేపు గడిచాక "మన హారిస్ ఆరొట్టెజోలికి పోకుండా వుంటే ఎంత బాగుండేదిరా?" అన్నాడు జార్జి ఆ భూమిమీద ఆఖరుసారిగా హారిస్, రొట్టె మా కంటపడిన ప్రదేశాన్ని పస్తాయించి చూస్తూ, విచారసూచకంగా నిట్టూర్పులు విడిచాడు. సరిగ్గా అదేసమయానికి హారిస్గాడి తలకాయ భూమిలోనుంచి మొలుచుకురావటం మొదలుపెట్టింది. మాయిద్దరికీ భయంతో గుండెలు కొట్టుకోవటం మానేశాయి. వొంట్లో ఎక్కడి రక్తం అక్కడ గడ్డకట్టుకుపోయింది: తలమీది వెంట్రుకలు నిక్క పొడుచుకొన్నాయి. అక్కడ దట్టంగా పెరిగివున్న గడ్డిలోనుంచి హారిస్గాడితల ఒక్కటితప్ప మరేమీ కనిపించటం లేదు. ఆ మొఖంకూడా ఎర్రగా కందగడ్డలా వుంది. దెయ్యాలకి కోపంవస్తే అల్లాగే వుంటుందికాబోలు మరి!

జార్జే ముందుగా కొంచెం తట్టుకొని, "నువ్వు నిజంగా హారిస్వే అయితే, యీ క్షణాన బ్రతికే వున్నావో, చచ్చేపోయావో బ్రతికేవుంటే నీవొంట్లో మిగిలిన భాగం ఎక్కడికి పోయిందో అంతా వివరంగా చెప్పు!" అని ఆ దెయ్యాన్ని అడిగాడు.

"చేసింది చాలక అడ్డగాడిదలా వేళాకోళం చేస్తావుట్రా?" అని హారిస్ తల, పళ్లు పటపట కొరకటం మొదలుపెట్టింది.

"ఏంచేశామంటావ్?" అని నేనూ జార్జి ఒక్కసారే అడిగాం—వెర్రిమొఖాలు పెట్టేసి!

"ఇంకా ఏం చెయ్యాలి! ఈ దిక్కుమాలిన చోట నన్ను కూర్చోబెట్టారు చాలదూ?...ఊ...ఇంద... ఈ రొట్టె అందుకో!"అన్నది, హారిస్తల.

భూమి అడుగునుంచి రొట్టె పుట్టుకొచ్చింది దాన్నిండా బురద, గడ్డి అంటుకుపోయాయి. ముందు దాన్ని అందుకొన్నాము. తరువాత హారిస్ ఎలాగో వూడిపడ్డాడు. వాడి వొళ్లంతా బురదే!

ఇంతకీ జరిగిందేమిటంటే — మా హారిస్ ముందు సరిగా చూసుకోకుండా వూబికి అంచునే కూర్చున్నాడు. ఆవూబి అంతా గడ్డితో కప్పడిపోయి వున్నందువల్ల, ఆ విషయం వాడికీ తెలియలేదు; మాకూ తెలియలేదు. కూర్చున వాడు అలా కదలకుండా కూర్చున్నా యింత రసాభాసు జరిగేదికాదు; రొట్టెను ముక్కలుచెయ్యటంలో ఎప్పుడో పొరపాటున వెనక్కి జరిగివుంటాడు. దాంతో అమాంతం ఆవూబిలో కూరుకుపోయాడు.

ఊబిలో పడుతున్నప్పుడు వాడి అనుభవం చాలా చిత్రంగా వుందట. ఏం జరుగుతున్నదీ, తను ఎక్కడికి వెళ్లుతున్నదీ వాడికి ముందు ఎంతకీ అర్థం కాలేదట. బహుశః అర్ధాంతరంగా ప్రళయం ఏదో వచ్చి సృష్టి అంతం కాబోతున్నది కాబోలనుకొన్నాడట.

ఇంతకీ యిదంతా తన పొరపాటువల్లనే జరిగిందని హారిస్ యీనాటికీ ఒప్పుకోడు. పైగా మేమే కావాలని వాణ్ణి ఏడిపించటానికి యింతపన్నాగం పన్నివుంటామని వాడికి యీరోజుకీ నమ్మకమే. ఏపాపమూ ఎరుగనివాళ్లని లోకం యిలాగే శంకిస్తుంటుందికదా!

## 14

మా భోజనాలు అయ్యాక గాలి వాలు అనుకూలంగా వుంది. పడవ ప్రయాణం చురుకుగా

సాగింది 'సోనింగ్' చేరేదాకా పడవని ఎక్కడా ఆపకుండా పోనిచ్చాం. అక్కడ పడవని కట్టేసి, అలా కాసేపు తిరిగివద్దామని వూళ్లోకి వెళ్లాం. అంతా ఒక గంట సేపు వూరంతా చుట్టబెట్టి, పడవల రేవుకి వచ్చి మా పడవకి లంగరు ఎత్తాం. అప్పటికే పొద్దుపోయింది. 'రీడింగ్' చేరేలోగా ఎలాగూ బాగా చీకటిపడిపోతుందని అంచనా కట్టి, ఆపూటకి 'షిప్‌లేక్' దీవుల్లో మకాం వెయ్యటం మంచిదనుకొన్నాం. తీరా అక్కడికి చేరేసరికి చీకటిపడటానికి యింకా చాలాటైం వుంది. కాలక్షేపం ఎలా చెయ్యటమా అని ఆలోచిస్తూ వుండగా, వంట వొండుకొందామని జార్జి సలహా యిచ్చాడు. ఇలా పడవల్లో ప్రయాణం చేస్తున్నప్పుడు సునాయాసంగా వంట వండటం ఎలాగో తనకి బాగా తెలుసుననీ, అదంతా మాకు బోధపరుస్తాననీ అన్నాడు. మాదగ్గిర అప్పటికి తినగా మిగిలిన కూరలు, మాంసం అన్నీ వుపయోగించి 'ఐరిష్ పులుసు' వండితేరుచిగా వుంటుందని, సరుకు ఆటె వస్తుందనీ అన్నాడు.

వాడు ఆ పులుసు పేరు చెప్పినప్పుడు మాకు చాలా సరదాగానే వుంది. జార్జి ఎండుపుల్లలు ఏరుకొచ్చి నిప్పు రాజేశాడు. హారిస్సు, నేనూ కలిసి బంగాళాదుంపలమీద పొట్టుతియ్యటం ప్రారంభించాం బంగాళాదుంపలమీద పొట్టుతియ్యటం అంత కష్టమైన పనిగా నేను ఎప్పుడూ అనుకోలేదు. కాబట్టి ఆ పని మొదలుపెట్టినప్పుడు యిద్దరమూ వుత్సాహంగానే ఆడుతూ పాడుతూ మొదలుపెట్టాం. కాని అంత వుత్సాహమూ మొదటి బంగాళాదుంప సగం వలిచేసరికే చచ్చిపోయిందంటే నమ్మండి. దాని దుంపతెగ— బంగాళాదుంపమీద పొట్టు వలుస్తున్నకొద్దీ అనంతంగా అలా వస్తూనేవుంది. చేతులు చచ్చుపడిపోయేటంతవరకు పొట్టువలిచి చూద్దుముకదా— వెలక్కాయ అంత వున్న దుంప, పొట్టు పూర్తిగా వలిచేసరికి, బఠాణీ గింజ అంత మిగిలింది.

వంట వెలగబెట్టుతున్న జార్జి, చెయ్యి తీరిక చేసుకొని వచ్చి చూశాడు. బంగాళాదుంపలన్నీ యిలా ధ్వంసం చేస్తున్నందుకు మామీద మండిపడ్డాడు. చాకులాంటిది తీసుకొని పైపైన పొట్టు గీకమని మా యిద్దరికీ హుకుం వేశాడు.

గీకాం: గీకాం!— ఈ గీకటం కంటే వలవటమే చాలా తేలిక అనిపించింది. బంగాళాదుంపలు వున్నాయంటే, అవి అన్నీ ఒక్క ఆకారంగా వుండిపడవవు. ప్రతి దుంపమీదా ఏమిటో బొడిపెలు; ఏమిటో గంట్లు! ఇల్లాంటి పదార్థంమీద గీకటం ఎలాగ? మొత్తానికి అరగంటసేపు యమయాతనలు పడి, నేనూ హారిస్సూ కలిసి నాలుగుదుంపలు పొట్టు గీకేసరికి, యిద్దరమూ చెడ్డ అలిసిపోయి, యిక ఆరోజు రోజు అంతా ఆపనే పెట్టుకొంటే తప్ప యిన్ని బంగాళాదుంపల పొట్టు తీయడం మాతరం కాదని జార్జితో చెప్పేశాం

కేవలం బంగాళాదుంపలమీది పొట్టు వలిచినంతమాత్రాన మనిషిఅనేవాడికి యింత హైరాను అవుతుందంటే నేను నమ్మలేకపోయేవాణ్ణి. కాని ఆరోజు చూద్దునుకదా — మేము వలిచింది నిజానికి నాలుగుదుంపలేఅయినా, వాటి తాలూకు పొట్టు మాత్రం మాచుట్టూ పెద్ద కొండఅంత ఎత్తున పడిపోయింది.

ఆ నాలుగు దుంపల్నీ జార్జికి యిస్తే, వాడు, యీనాలిగింటితోనే పులుసుకాదని కేకలు వేశాడు. మరొక ఐదారుదుంపలు పొట్టు తియ్యకుండా నీళ్లల్లో కడిగి పులుసులో పడేశాం. కొంత కాబేజీగడ్డ, కాసిని పచ్చి బఠాణీలు మా సంచి అడుగున మిగిలివుంటే వాటినీ పులుసులో పడేశాం. ఇంకా ఎంత పడేసినా ఆ పులుసులో పట్టేటట్లే కనిపించింది. గోనె సంచులు, చేతిసంచులూ అన్నీ బోర్లించి అడుగు బొడుగున మిగిలిన చెత్తా చెదారం అన్నీ అందులో పడేశాం. పొద్దుటి రొట్టె, కొంచెం పచ్చి మాంసంవుంటే, వాటినికూడా అందులోనేఎక్కించాం. ఇంతలో జార్జికంటికి చేపలడబ్బా ఒకటి కనిపించింది. దాన్ని పగలగొట్టి, అందులోని సరుకు అంతా పులుసులో గుమ్మరించాడు.

ఐరిష్ పులుసులో వుండే సుళువు యిదే. దాచిపెట్టటం దండగగా తోచిన ప్రతి వస్తువునీ అందులో పడెయ్యవచ్చు.

నాకు ఎక్కడో రెండు, సగం బీటపడిన కోడిగుడ్లు కనిపిస్తే, వాటిని సాంతం బద్దలుకొట్టి సొన అంతా పులుసులో పడేశాను కోడిగుడ్లు పడితే

# ★ ముచ్చటగా ముగ్గురు ★

పులుసు బాగా చిక్కబడి మంచి రుచిగా వుంటుందని జార్జి అన్నాడు.

ఇంకా ఏమేమి వేశామో అదంతా జ్ఞాపకం లేదు కాని, మొత్తానికి బరువు దండగా వున్న సరుకు చాలాభాగం ఆరోజు వదుల్చుకొన్నాం. మేము యీ పనులన్నీ చేస్తున్నంతసేపూ మమ్మల్ని హుషారుగా అంటిపెట్టుకు తిరుగుతున్న మా మాంట్ మొరస్సీకూడా పులుసు కాగటం పూర్తికాబోయే సమయానికి ఎక్కడి నుంచో చచ్చిన ఎలుక నొకదానిని నోట కరుచుకొని తెచ్చి, కాగే కాగే పులుసులో పడేసింది. ఇటువంటి చర్యవల్ల అది మమ్మల్నిది మరి అవహేళనే చేయ దలచుకొన్నదో, లేక, మేమంతా కష్టపడుతూ వుండటం చూసి తనూ తనకు చేతనైన, చేయకపోతే బాగుండదనుకొనే యీ పని చేసిందో తేల్చిచెప్పటం చాలా కష్టం.

ఇంతకీ పులుసులోపడ్డ ఎలుకను అలాగే వుడక నియ్యటమా, లేక వెంటనే తీసిపారెయ్యటమా అనే అంశాన్నిగూర్చి మాలో మేము కాస్సేపు వాదులాడు కొన్నాం. ఈపాటికే ఎలుక తాలూకు శరీరమంతా మిగిలిన పదార్థాలతో కలిసిపోయి కలగా పులగం అయివుంటుందనీ, అల్లాంటప్పుడు దాన్ని బయటికి తీయాలని ప్రయత్నం చేయటం శుద్ధదండగనీ హారిస్సు వాదన. జార్జి తాను చస్తే ఒప్పుకోనన్నాడు. ఐరిష్ పులుసుని యిదివరకు ఎవరైనా ఎలుకతోపాటు వుడికించారనటానికి చరిత్రాధారం ఏదైనా వుంటే, అప్పుడు చూసుకోవచ్చుకాని, అటువంటి ఆధారాలు ఏమీ లేకుండా కొత్తకొత్త రకాల ప్రయోగాలు చేయటం చాలా ప్రమాదకరమైనవిషయమని హెచ్చరించబోయాడు.

"చెయ్యబోయే ప్రతి కొత్తపనికీ నీలాగు ప్రతివాళ్లూ, 'యిదివరకు ఎవరైనా యీపని చేశారా?' అని అడిగేట్లయితే, ప్రపంచంలో యింక పురోగమన మనేదే లేకుండా పోతుంది. నీలాంటి మొరటు మనుష్యులే నాగరకతాభివృద్ధికి ఎప్పటికప్పుడు అడ్డు పడుతూ వున్నట్లు చరిత్రలో లక్ష వుదాహారణలు చూపించగలన"ని హారిస్సు వాణ్ణి నానాచివాట్లూ వేశాడు.

మొత్తానికి పులుసు దివ్యంగా తయారైంది. మామూలు వంటకాలు తినితిని చవి చచ్చిపోయిన మా జిహ్వలకి, యీ సరిక్రొత్త వంటకం అమృత తుల్యంగా తోచింది.

రుచి గొప్పగా వుండటం మాత్రమే కాదు: వొంటికికూడా చాలా మంచిదనిపించింది. జార్జి అన్నట్లు బలవర్ధకమైన పదార్థాలు, అందులో ఎన్నో పడ్డాయికదా మరి! కాకపోతే— ఆ బంగాళాదుంపలు, బఠాణీలు యింకా కొంచెం మెత్తగావుడికివుంటే బాగుండేది. అయినా మా ముగ్గురికీ పళ్లు గట్టిగానే వున్నాయి కాబట్టి సరిపెట్టుకొన్నాం.

తరువాత టీ కాచుకొన్నాం. మా మాంట్ మొరస్సీ ఆరోజు టీ కెటిల్ మీద యుద్ధం ప్రకటించింది.

అసలు మా ప్రయాణం పొడుగునా ఎందుకన్నో మాంట్ మొరస్సీకి టీ కెటిల్ని చూస్తే పడకుండా వుంటోంది. పొయ్యిమీద కెటిల్ చప్పుడు చేస్తున్నప్పుడల్లా, 'యిది దాని కెదురుగుండా కూర్చుని పళ్ళు కొరుకుతూ బుసలుకొట్టేది. కెటిల్ మీది మూత ఎగిరి పడటం మొదలుపెట్టగానే, అది తనమీదనే సవాలు చేస్తున్నదని భావించి, దానిమీదికి లంఘించబోయేది. సరిగా అది కెటిల్ మీద పడబోయే సమయానికి మాలో ఎవరో ఒకరు వెంటనే కెటిల్ని పొయ్యిమీద నుంచి దించేసి వీళ్ల తగువు తీర్చేసేవాళ్లం.

ప్రతిసారీ తన ప్రత్యర్థి యిలా వీనమెత్తువాసిలో బ్రతికిపోతూవున్నందుకు, మాంట్ మొరస్సీకి యీసారి చాలా పట్టుదలగావున్నట్లుంది—ఏమైనాసరే ఆ కెటిల్ సంగతి తేల్చిపారేయాలని. కెటిల్ కాస్త చప్పుడు చెయ్యగానే లేచి నిల్చొని భయంకరంగా బుసలు కొట్టింది. మా కెటిల్, కావటానికి చిన్నదేకాని, గుండె బలం బాగావున్నరకం. ఇంకా బాగా చప్పుడుచేసి, మాంట్ మొరస్సీమీద కసిగా వుమ్మేసినట్లు యిన్ని నీళ్లు పైకి చిమ్మేసింది.

(౫౫-వ పేజీ చూడండి)

**తె**ల్లవారవచ్చింది రామమూర్తి ఇంకా పడకపైనుంచి లేవ లేదు

రామమూర్తి: "జై పాతాళ భైరవీ!"

దేవి "నరుడా! ఏమి నీకోరిక?"

దేవి ప్రత్యక్ష మయినందుకు సంభ్రమంతో రామమూర్తి పొయ్యింటివైపు తిరిగి పెళ్లాన్ని బిగ్గరగా పిలిచాడు

"సరోజా, దేవి ప్రత్యక్ష మయ్యింది, కాస్త త్వరగా పిల్ల వాళ్ళను తీసుకురా" అని కేకవేసి, దేవి వెళ్ళిపోతే ఎట్లాగా! అనే చింతతో దేవి ముఖంచూస్తూ నిల బడిపోయాడు

దేవి నరుడా! ఏమి నీకోరిక?

రామ కాస్త నిదానించు తల్లీ! ఇప్పుడే నా పెళ్లాము, బిడ్డలను పిలిచాను వాళ్ళొచ్చిన తక్షణం, మాకు, ఏ, ఏ కోరికలు కావలెనో, తప్పక కోరుకుంటాము.

దేవి నరుడా! ఏమి నీ కోరిక?

రామమూర్తి తన పెళ్ళాము రాకముందే, కోరిక కోరమని దేవి, నిర్బంధిం మ మన్నది, ఎట్లనా? అని చేతులు నులుముకుంటూ నిలబడి పోయాడు

దేవి నరుడా! ఏమి నీకోరిక?

రామ: దేవీ! కాస్త నా పెళ్లాము మీద కూర్చొని, ఇన్ని రోజులు రావడానికి నిదానమౌతుంది. అది మీరు ఎక్కడుంటిరి, ఏమి చేస్తుం వచ్చేవరకు తమరు, ఈలా కుర్చో (43-వ పేజీ చూడండి)



"కాస్త నిదానించు తల్లీ! ఇప్పుడేనా పెళ్లాము పిల్లలను పిలిచెను'

# పైత్యం చదువు

1-వ రంగము

(తరగతి గదిలో)

మాష్టరు (అటెండెన్సు వేస్తూ) రామమోహన్.

రామమోహన్: ప్రజంటు సార్

మా: హనుమంతరావు

హనుమంతరావు: ప్రెజెంటుసార్

మా: కోటేశం

కోటేశం: వచ్చానండీ

మా: జాన్

జాన్: ఉన్నానండీ

మా: సుభద్రాదేవి

సుభద్ర: ఊఁ...

మా: గోపాలకృష్ణయ్య

గోపాలకృష్ణయ్య: జై ఆంధ్రా!

మా: సత్యం

సత్యం: (శాంతము లేక సౌఖ్యము లేదు అని గొణుగుతాడు)

గో: (పెద్దగా) నిన్నేరోయ్! శాస్త్ర సంగీతం కట్టిపెట్టు

మా: ప్రజంటు చెప్పటంకూడా మరిచిపోయి పాట కచ్చేరి పెట్టే వేమిరా?

స: (హడావుడిగా లేచి) ఆఁ! కాదండీ, నేను...నేను.

మా: ఏమిటీ! నీ మొఖం. నువ్వా తోడిపిల్లలను చూచి శాస్త్ర జ్ఞానమన్నా తెచ్చుకో!

గో: వీడెప్పుడూ ఇంతేనండీ! మహా గొప్ప సంగీతంవచ్చిన వాడిలాగా కూనిరాగాలు తీస్తాడండీ!

రా: అవును మాష్టరుగారూ-నిన్న వీడు నాదగ్గర లెక్కలు చెప్పించుకోడానికి వచ్చి సినిమా పాటలు పాడి నన్నూ లెక్కలు చేసుకోనియ్యలేదండీ.

సు: చదువుకోకుండా వీధినాటకానికి వుడాయించాడని మొన్న వాళ్ళనాన్న కొడుతున్నాడండీ!

మా ఆ! ఇహ చాల్లే ఆపండి. అందరూ మహానుభావులే! సరే దశరథుని పాఠం చదివారు కదూ?

పిల్లలంతా: ఆఁఆఁ చదివామండీ.

గో: మాష్టరుగారూ!

మా: ఏఘ్ అప్పుడే లేచేవ్? నేనేమన్నా నిన్ను అడగబోతానని ముందే ఏదో ఎత్తువేశావ్.

గోపాల్: ఏమీలేదు. దశరథుడంటే పది రథాలు కలవాడసికదూ చెప్పారు?

జాన్: దశరథుడు రాజుగదా— ఆయనకు పది రథాలేనా ఉండేదని వీడి అనుమానమండీ.

రా: అదిగాదు లేరా! పది రథాలు కలిసి ఒక రథం చేశారేమో! అటువంటిది దశరథుడు కున్నదేమో నని.

గోపాల్: నేనడిగేదదిగాదండి- దశరథుడంటే పది రథాలు గల వాడుగదా; ఒకడు పది రథాల మీదెట్లా వుంటాడని.

మా: ఇష్. నోరుముయ్యండి - అన్నీ చొప్పదంటు ప్రశ్నలు.

సు: ఇదివరకొకసారి చొప్పదంటు ప్రశ్నలంటేఏమిటో ఇంకొక మారు చెప్తామన్నారు. ఇవ్వాళన్నా చెప్పండి పంతులుగారూ!

మా: ఇగుగో వింటున్నావుగా! అన్నీ యిటువంటివే. పనికిరానివి, అవసరం లేనివి. దశరథుడంటే ఎవరో, ఆయన ఏ రాజ్యం ఏలేవాడో, ఎంతమంది బిడ్డలో, ఏమేమి చేశాడో వీటినిగురించి ఎవరికీ పట్టదు.

గోపాల్: తెలియక అడిగాము లెండి.

మాష్టరు: అయితే నువ్వు తెలిసికోవలసినది రథాలు, వాటి చక్రాలు, చక్రాలకుపయుండే ఆకులు, ఇటువంటివేనా?

జాన్: అయికూడా తెలిసికోవద్దండీ! దశరథుడు రాజని అననే అన్నారుగదా! మళ్లీ ఇంకా రాజ్యమేలేడని చెప్పటం దేనికి?

గోపాల్: అవును మరి ఏదో ఒక రాజ్యాన్ని ఏలేవుంటాడు గదా!

జాన్: ఏలినోడేగా రాజయ్యేది.

గోపాల్: అయినప్పటికీ ఏలేడని చెప్పినట్లు చెప్పకపోయినా, రథం సంగతులూ అవీ తెల్సుకోవాలి గదండీ.

మా: అన్నీ తెలుసుకొనేటట్లు

గానే ఉన్నారు. ఆదిలోనే హంస పాదు-గోపాల్ నువ్వు కూచో.

గోపాల్: ఆదిలోనే హంసపాదు అంటే ఏమిటో అదైనా చెప్పండి.

మా: (వినిపించుకోకుండా) సత్యం నువ్వు చెప్పరా? దశరథున కెంతమంది బిడ్డలు?

స: శ్రీరామ, సీతారామ-ఆఁ ఆఁ ఏమిటి-

గోపాల్: కాపాడరావా, కాపాడరావా (అని అందుకొంటాడు.)

మా: గోపాల్! నువ్వు నోరు మూసుకు కూర్చోరా!

గోపాల్: వాడు పాటపాడటం బాగుందండి?

మా: వాడిసంగతి నేను కనుక్కుంటానుగా. ఒరే సత్యం. నిన్ను ప్రశ్న అడిగితే పాటపాడుతా వేమిరా? నువ్వీ పాటలతో పాడై పోయేట్టున్నావ్. వళ్ళు దగ్గిర పెట్టుకొని చదువుకో. లేకుంటే నీ తాట వలుస్తా.

స: కాదు మాష్టరుగారూ! రాముడిమాట ఎత్తబోయేసరికి శ్రీరామ సీతారామ అనేపాట గుర్తుకొచ్చిందండి.

మా: పాటలుగాదు-ప్రశ్నలకు జవాబులు గుర్తు రావాలిరా? తెలిసిందా? (అని గద్దించును)

స: అవే చెప్పుదామనుకున్నా-చెప్పొచ్చేసరికి పుటిక్కున పాటొచ్చిందండి.

మా: వస్తుంది వస్తుంది. అయితే బెంచిమీదకి చేతులుగూడ వస్తయి సరేనా! మళ్ళీ ఇదే పాఠం గట్టిగా చదువుకొనిరండి. ఊఁ (గంటవిని పుస్తకాలుతీసికొని అంతా లేస్తారు.)



మాష్టారు: గోపాల్ నువ్వు నోరుమూసుకోరా.
గోపాల్: వాడు పాడటం బాగుందండీ!
మాష్టారు: వాడిసంగతి నేను కనుక్కుంటాను.

గోపాల్ శ్రీరామ సీతారామ (అని చప్పట్లు వేయును)

రా: ఊరుకోరా! వాడి అలవాటువాడిది అట్లా ఎగతాళి చేయదలచుకొంటే నువుమాత్రం తక్కువేమ్. కోతిలాగ కళ్లార్పుతూ.

జాన్: ఈడికి తెలిసింది లేరా. ఆడో కగొప్పసంగీత యిద్వాంసుడు అవబోతున్నాడని. దానికి ఈడి పక్క-తాళం-మన సత్యమంటే ఏం టనుకున్నారు? పెద్దయాట్టరే!

గోపాల్: వీడికి పక్క-తాళం మన రామ్‌గాడే.

జాన్: వాడు వాడే, వీడు వీడే.

కోటేశం: ఇద్దరూ కలిస్తే పాడే.

గోపాల్: ఇదంతా వీళ్ళకు మూడే.

(అంతా గొల్లున నవ్వుతారు. గోపాల్ 'శాంతములేక సౌఖ్యము లేదు' అని పాడుతూ పోతాడు - అంతా ఎవరిళ్ళకువాళ్లు పోతారు.)

2-వ రంగము

(సత్యం యిల్లు)

సత్యం తండ్రి: ఆ వెధవాయ్ కొంపచేరాడా?

తల్లి: ఇంకా రాలేదండి.

తం వాడెందుకొస్తాడు వాడేం చదువుతాడు వాడికేదో పట్టింది

తల్లి వాడి ముఖంతెద్దురూ - పసితనం

తం అప్పుడు పిల్లగా వుంగంది పెద్దయినాక బాగుపడ్డట్టే

తల్లి కాస్త ఈడొస్తే వాడికే తెలుస్తుంది అయినా వాడిప్పుడంత చెయ్యరానిపనేం చేశాడండీ!

తం ఇంకేం చెయ్యాలి ఇంటిపట్టునుండి చదువు వంటపట్టించుకోవలసిన రోజుల్లో, బజారు భాగవుతాలదగ్గరా, వీధి పురాణాల దగ్గరా, బయట తోపులవద్దా గంటలతరబడి ఒళ్లు తెలియకుండా నిలబడి తలకాయ తిప్పుతూ తాళం వేస్తుంటే వాడింకేమి పనికొస్తాడు? సంగీతంలో బడి చదువుకున్న చుట్టాడంటాడు వాళ్ల మాష్టరు

(ఇంతలో సత్యం యింటికి వస్తాడు)

స "పోరా బాబూ పో - పోయి చూడు ఈ లోకం పోకడ" (అని పాడుతూ వస్తాడు)

తల్లి ఏం నాయనా ఇంతసేపు ఎక్కడున్నావ్?

తండ్రి నే చెప్తా విను - వీధి భాగోతుల దగ్గర

స కాదు నాన్నా

తం కాకపోతే భజన పార్టీ దగ్గిర

స ఊహుఁ లైబ్రరీ దగ్గర రేడియోలో ఎవరో కమ్మగా పాడుతుంటే రా బుద్ధిపుట్టలే! ఆ పాట కాగానే గబగబా పరుగెత్తుకొచ్చా

తం ఏదో ఒకటి మొత్తం మీద కూటికి గుడ్డకు రాని ఘన కార్యం

తల్లి బాబూ చక్కగా చదువుకోనవలసిన రోజుల్లో అల్లా తిరగటం తప్పు కాదూ!

స పాట వింటుంటే నాకేం తప్పుగా తోచలేదమ్మా, పైగా చదువుకన్నా పాటలంటే బలే సరదా నాకు

తం (కోపంతో) సరదాగానే ఉంటుంది చూస్తున్నాపుగా - చదువు రాని వాళ్ళని - పెరిగి పెద్దయినాక జోల్పె తీసుకొని అడుక్కు తినాలసిందే (కోపంతో వెళ్లిపోతాడు)

తల్లి నాయనా! సత్యం!! ఇకనట్లా తిరగొద్దు బాబూ! మీనాన్నకు కోపం వచ్చింది ముందు చదువుకొని పెద్దవాడి వయితే తరువాత సంగీతంతో హాయిగా సరదాగా గడపవచ్చు

స నువ్వెంతన్నా చెప్పమ్మా - నిజం చెప్తున్నా - సంగీతం మీద ఉన్న మోజు చదువు మీద లేదమ్మా!

తల్లి అట్లా అంటే ఎట్లా నాయనా

స నాకు సంగీతం చెప్పించు, అదయితే బాగా నేర్చుకుంటాను ఇంకెక్కడికీ పోను

తల్లి అమ్మో, మీ నాన్న వింటే ఊరుకుంటారూ?

స ఇంట్లో నాన్న ఊరుకోడు బళ్ళో మాష్టరు బతకనివ్వడు ఇష్టం లేని చదువు నాకు రానేరాదు. నన్నేమి చావమంటావే!

తల్లి ఛీ! తప్పునాయనా అట్లా అనుకోకూడదు

స అయితే నాకు సంగీతం చెప్పించు

తల్లి ,అది నేను చేసేపనా నాయనా?

స నాకు నిజానికి అయితే చదువు రానేరాదు

తల్లి అదిగాదురా బాబూ — అట్లాగంటే ఎట్లా సంగీతానికైనా చదువు రావాలిగా

స సంగీతంచెప్పిస్తే చదువు కూడా నేర్చుకుంటా

తల్లి బాగానే ఉంది నీవేషం ఆయన అట్లా, నీవిట్లా, మధ్య నాకొచ్చి పడ్డ దీచిక్కు

స నువ్వు ఏమన్నా అనమ్మా- నాన్న తిట్టినా - మాష్టరు కొట్టినా- అందరూ ఎగతాళిచేసినా, నాకు మాత్రం సంగీతమంటే సరదా పోనేపోదు (తనదారిని తాను పోతాడు )

౨ వ రంగము

(సత్యం ఒంటరిగా ఆలోచన చేస్తూ ఉంటాడు జుట్టంతా చిందర వందరగా రేగి ఉంటుంది రామమోహన్ వస్తాడు )

రా ఏమిటి సత్యం దిగులుగా వున్నావు బడికి రావడం మానేశావు, మీ నాన్న ఏమన్నా అన్నారా ?

స ఏం చెప్పమంటావురా! నేనంటే అందరికీ కోపం నాకిష్టమయింది నేను చేస్తా నన్నా-నా గొడవ ఎవరూ పట్టించుకోరు కాని దానికోసం పాకులాడమంటారే గాని, యిష్టమయింది నేర్చుకోమని ఎవరూ అనరు నా మనస్సంతా

సంగీతంకోసం పరుగులు తీస్తోంటే మా వాళ్ళు చదువు, చదువు అని నాగొంతు నొక్కుతున్నారు. ఇంటికి పోగానే ఒక హార్మోనియమో ఫిడేలో తెచ్చియిచ్చి, 'హుషారుగా సంగీతం నేర్చుకోరా' అని అమ్మా, నాన్న అంటే ఎంత ఆనందంగా ఉంటుంది!

రా: మన మనుకొన్నవన్నీ కావాలంటే అవుతాయా సత్యం?- కోరికలే గుర్రాలైతే యింక కావలసిందేముంది. అయినా ఎవరిచేతనైనా నీసంగీతం విషయం అమ్మా, నాన్నకు చెప్పించి ఒప్పించకపోయావా?

స: అదేం లాభం లేదురా! మాష్టరు తిట్టకమానడు; నాన్న కొట్టకమానడు. అసలు నాకు వీళ్ల మధ్య ఉండడమంటే ఎంతో కష్టంగా ఉంది. సంగీతం నేర్చుకొన్నదాకా నా మనస్సులో యీ దిగులు పోనేపోదు:

రా: మరేంచేయా లనుకొంటున్నావు?

స: చేసేదేముంది. నే నిక్కడినించి వెళ్లిపోయి, ఏ అయ్యకాళ్లన్నా పట్టుకొని సంగీతం నేర్చుకొంటా.

రా: నీ ఆలోచన బాగానేవుంది కాని, యిల్లువదలిపోతే ఎన్ని బాధలు పడాల్సివస్తుందో, అది కూడా బాగా ఆలోచించు.

స: ఏమన్నా కాని-ఎన్ని బాధలైనా పడతాను. సంగీతం సాధించి తీరతాను.

(మాష్టరు ప్రవేశం, రామమోహన్ జారుకుంటాడు)

మా (చెయ్యి అడ్డంగా పెట్టుకొంటాడు కనపడనివాడిలాగ) ఎవరా కూర్చున్నది?

స: (పరధ్యానంగా) ఆ...

మా: ఎవరది?

స: ఆ... నేనండీ.

మా: నువ్వట్రా సత్యం.

స: అవును మాష్టరుగారూ, మీ రెక్కడినుంచీ.

మా: తోటకెళ్ళి వస్తున్నాలే అది సరేగాని ఏమిట్రా నువ్వు రోజురోజుకు పిచ్చివాడవుతున్నావు. ఎక్కడబడితే అక్కడే!......

స: (చేతులు నలుపుతూ) లేదండి మాష్టరుగారూ!

మా: ఏమి లేకపోవడం? ఏమిటా తిరగటం?- నిజం చెప్పరా-నీకేమన్నా మతిపోయిందా ఏం?

స: (ఏడుస్తూ) ఏం చెప్పమంటారు మాష్టరుగారు. నాకు చదువు రాదు మాష్టగారూ.

మా: అదేమిటిరోయ్.

స: నిజమేనండీ- ఇక నేను యిష్టంలేని చదువు చదువలేను. చదివినా రాదు.

మా: పిచ్చివాడా! ఏం పరవాలేదులే. అందరికీ పుడుతూనే కొమ్ములొచ్చినయ్యేం, నేను చెప్తాగా నీకు. ఛీ. ఛీ. ఏడవబోకు. నీలాంటి వాళ్లకు గట్టిగా చదువు అబ్బేటట్లు చెప్పాలనే నా కోర్కె-ఆపని నాకు వదిలేసెయ్. నువ్వు రేపటి నుండీ హాయిగా వచ్చి చదువుకో.

స: మీరు నన్ను వదిలెయ్యండి మాష్టరుగారూ. మానాన్నగారితో 'మీవాడికి చదువురాదు. శుద్ధ దండుగ. వేరే ఏదైనా చూచుకోండి' అని చెప్పండి.

మా: అంతదాకా అవసరం లేదు లేరా సత్యం-అంత అధైర్య పడుతావు దేనికి? .రేపటినుంచే నీ విషయం గట్టిగా చూస్తాను. ఇంటి దగ్గ రేమనకుండా మీ నాన్నా వాళ్ళతో చెప్తాలే.పో. ఇంటికి వెళ్లి చక్కగా చదువుకో.

(మాష్టరు వెళ్లును- తెర వాలును)

4-వ రంగము.

కొన్నాళ్లతరవాత: సత్యం పైజమా-లాల్చీ వేసికొని మంచి హుషారుగా ఉంటాడు. అతని ముఖంలో ఎన్నో అనుభవాలు కనుపిస్తుంటాయి. స్నేహితులు ప్రవేశం.)

గోపాల్: ఎంతవాడి వైనావురా సత్యం!

రా: నే నప్పుడే చెప్పలేదురా, వాడు దేశాలమీద పారిపోగానే- నువ్వు ఏదేదో వాగావే- ఇప్పుడు తెలుస్తున్నదా?

జాన్: రామ్‌మోహన్ నువ్వు మునుపు సత్యానికి తాళం వేసేవాడివే. ఇప్పుడు వాడే ఆ కాస్త పనీ చేసేస్తున్నాడు. వాడి నోరెప్పుడూ అంతే - ఎటు మొగ్గుంటే అటే వాడి వోటు.

కోటేశం: నిజమేరోయ్ - గోపీగాడెప్పుడూ కొక్కిరాయె.

గోపాల్: చాల్లే-నోరుముయ్యండోయి. ఆపాటి ధైర్యంచేసి దేశంమీద పోయి సంగీతం సాధించుకొచ్చినాడు లేడు గాని, కబుర్లు మాత్రమయితే అంతా చెప్తారు.

కోటేశం: ఇది చూచి గోపాల్ దేశాలపాలవుతాడేమో!

జాన్: అంతపని చేయబోకురోయ్ అడుక్కుతిని అనుకున్నదాన్ని

# ★ సత్యం చదువు ★

సత్యంగాబట్టి నెగ్గించుకొచ్చాడు గాని, అంతపనికి పూనుకున్నావా ఏదో రోజు రు అన్నమో రామ చంద్రా అంటూ ఇంటి దారి పడ తావు.

గోపాల్: అది అందరికీ అబ్బేది గాదురా. అనుకోటంమాత్రం తేలికే.

కోటేశం: నువ్వనబొయ్యేది ఆ మాటేనని మా కెరికే.

జాన్: గోపీ చాతకానివాడైగాదు పోనిది. పనులు తీరక.

స: ఊరుకోండిరా! దీంట్లో ఎవరు చేసిన ఘనకార్యం ఏమీ లేదు. ఏదో నాకు బుద్ధిపుట్టింది. వెళ్ళి పోయాను. ఇష్టమైంది. ఎన్ని కష్టా లైనా పడ్డాను. కావాలనుకొని కష్ట పడి సంగీతం నేర్చుకున్నా. మన సుకు నచ్చింది కాబట్టి ఏదో తెలిసి నంతవరకు తెలిసింది - పోనీండి ఆ గొడవలు. మాష్టరుగారూ అంతా బాగున్నారా?

కోటేశం: ఆఁ బాగానే ఉన్నారు. ఇంకా దశరథుని రథాల సంగతి తేలనే లేదు.

జాన్: నీవు వెళ్ళినతర్వాత పాటల గాలి కొంత గోపీకి సోకింది రోయ్.

కోటేశం: వాడిఖర్మం. ఎక్కి రించబోయి ఎగతాళి చేయించు కొన్నట్లయింది. అభ్యాసం కూసు విద్య. అనుభవింపక తప్పే చే ముంది.

సత్యం: (నవ్వుతూ) ఏరా గోపీ! నిజమేనా?- చాల మారిపోయావే.

గోపీ: అదిగాదురా. నిన్నెదో ఎగతాళి చేయాలని గొణగటం, వంతపాడటం, మొదలుపెట్టితే అది అలవాటై కూర్చుంది అసలు ఇష్టంలేక పోవడంవల్ల రాదూ - అలవాటైనంత మాత్రాన పోదు.

స: బాగానే ఉంది వ్యవహారం.

కోటేశం: ఏమయినాగాని రేపు సత్యంపెట్టే పాటకచ్చేరిలో ఒక ముక్క నువ్వూ అని ముందుకు రా.

జాన్: వాడు ఊరుకోడులేరా- సత్యంకన్నాముందే వాడు తయారు.

గోపీ: అనండిరా! అనండి!! అనండి!!!

(అంతా వెళ్లిపోతారు. తెర వాలుతుంది)

5-వ రంగము

(పాటకచ్చేరి)

స: (అప్పారావుగారి పాట పాడును)

దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వొట్టిమాటలు కట్టిపెట్టోయ్!
గట్టి మేల్ తలపెట్టవోయ్!
పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయ్!
తిండికలిగితె కండకలదోయ్
కండకలవాడేను మనిషోయ్!"

(పాట విని చప్పట్లు కొట్టుతారు)

మాష్టరు: అబ్బా! ఎంతకమ్మని కంఠస్వరమండీ. అమరగానం చేశా డండీ. సంగీతంలో బాగా ఆరితేరి వచ్చాడండీ.

తండ్రి: కూటికి గుడ్డకు రాని కూని రాగాలు తీస్తున్నాడని, మాని పించాలని ఎంతో తంటాలుపడ్డాము చిన్నప్పుడు.—కాని మా సత్యం సంగీతంలో ఇంతవాడవుతాడని కలలోకూడ అనుకోలేదండీ.

కోటి: ఏమయితేనేం కోరిక సాధించుకొచ్చాడు - మొనగాడు అంటే వాడేనండీ.

మా: చిన్నప్పుడు సత్యం లేత మెదడులో పాదుకొన్న అభిరుచిని నేను కనుగొనలేకపోయాను. బల వంతాన యిష్టంలేని చదువు నెత్తిన రుద్ద ప్రయత్నించా. అదంతా దండుగేనని గుర్తించా.

గోపీ: మీ తప్పేముందిలెండి. అలాంటిచదువు చెప్పమన్న పైవారి పొరపాటేకాని- అందుకు మీరేం చేస్తారులెండి.

మా: పిల్లల పసిగుండెల్లో పొం గులువారే కోరికలు ఉపాధ్యా యులే గుర్తించాలి. గొర్రెదాటుడు చదువు వృధాప్రయాస.

తం: పిల్లలచదువు విషయంలో కుర్రాళ్ళ అభిరుచులకు తగ్గట్టుగా నడుచుకోవలసిన బాధ్యత తల్లి దండ్రులమీద కూడా ఉంది. పెద్దలు శ్రద్ధవహించకపోవటంవల్లనే భావిపౌరులైన బాలల ప్రవర్తనలో లోటుకు కారణం. ఇకనైనా అట్టి పొరపాట్లు చేయకపోవటం మంచిది.

మా: సత్యాన్ని ఆశీర్వది స్తున్నా. సత్యంలాంటి రత్నాలను తయారుచేసి దేశగౌరవం కాపాడ దీక్ష పూనుదాం.

(తెర వాలుతుంది)

★

# భక్తి సాధన

గోటేటి శ్రీరామారావు

పూర్వం రంగయ్య అనే ఒక వర్తకుడుండేవాడు. అతని భార్య రంగమ్మ. రంగమ్మకు దేవుడంటే భక్తి, దెయ్యమంటే భయమూ. వ్రతాలూ, పూజలూ, దానాలూ, ధర్మాలూ అంటే ఆమెకు యిష్టం. రంగయ్యకివేమీ కిట్టవు. పరమలోభి. నాస్తికుడు. ఎప్పుడూ వడ్డీకి వడ్డీ కట్టి రెట్టింపు లాభాన్ని లాగటం తప్పితే, మరొకటేమీ లేదు. ఏనాడూ 'కృష్ణా రామా' అన్న పాపాన పోలేదు.

ఆ వూరిలో రంగనాథస్వామి వారి కోవెలవుంది నిత్యం ఆ కోవెలలో ఏదో హరికథాకాలక్షేపమో గానకచ్చేరియో, భామకలాపమో, భరతనాట్యమో లేదా భగవద్గీతా పారాయణో జరుగుతూంటుంది. ప్రతి సాయంత్రము పురాణ కాలక్షేపం చేస్తారు. రంగయ్య ఒక్కనాడు కూడా పురాణం వినటంకాని, స్వామిసందర్శనంకాని చేసేవాడు కాడు.

భర్తయొక్క ఈ వికృతపు చేష్టలనుచూసి రంగమ్మ సహించలేకపోయేది. అతని వింతప్రవర్తనమూ, లోభిత్వమూ సుతరామూ ఆమెకు కిట్టవు. ఆమె ప్రతినిత్యమూ పురాణ శ్రవణమునకుగాని, హరికథా కాలక్షేపమునకు గాని పోయేది. స్వామిదర్శనం చేసుకొనేది. నిత్యమూ పండ్లూ ఫలాలూ ఇస్తూ, గుడిపూజార్లకు దక్షిణలిచ్చి సంతృప్తి పరచేది.

ఇలా ఉంటూండగా ఆ గ్రామానికి ఒకసారి లక్ష్మణదాసు అనే హరిదాసు వచ్చాడు. నలుగురు గ్రామపెద్దలవద్దకూ వెళ్ళి తన ప్రజ్ఞనూ పాండిత్యాన్నీ తెలియపరుచుకున్నాడు. జనపాల జుట్టూ, ముచ్చిగుంటలో జారుముడి వేయబడిన ఆ పిలకా, నుదుటిపై రూపాయి బిళ్ళంతకుంకుమబొట్టూ, చెవులకు కమలాలు, చేతికి స్వర్ణకంకణాలూ, గండపెండారాలూ చూసి నలుగురూ ఆయనను సాక్షాత్తూ పరమేశ్వరునితో పోల్చుకొని, మహాభారత కాలక్షేపము కావింపమన్నారు. రంగమ్మగారుకూడా, ఆయనకు తన యింట ఆతిథ్యమిచ్చి వూరివారు 'భారతకథ' చెప్పమన్న తీర్మానాన్ని బలపరచింది.

రంగనాథస్వామి కోవెలలో బ్రహ్మాండమైన పందిరివేసి, ఆడవాళ్ళకూ, మగవాళ్ళకూ వేర్వేరు స్థలాల నేర్పరచి, సంరంభంతో ఏర్పాట్లు చేశారు.

ఏకాదశీ పర్వదినం రోజున భారతకథాకాలక్షేపానికి వుపక్రమించారు లక్ష్మణదాసుగారు. ఆ గ్రామంలో పిన్నలూ, పెద్దలూ ఎల్లరూ, విచ్చేశారు, ఒక్క రంగయ్యమినహాగా. దాసుగారు శ్రావ్యంగా పాడుతూ ద్వంద్వార్థమిచ్చే పదాలను ప్రయోగిస్తూ, మధ్య మధ్య హాస్యరసాన్నొలకబోస్తూ మనోహరంగా హరికథాగానాన్ని చేస్తున్నారు. హరికథ బాగుందని, దాసుగారికీర్తి బాలభానునికిరణకాంతుల రీతిగా నలుదెసలా వ్యాపించింది. ఆనాటి కానాటికి జనం విపరీతంగా వస్తున్నారు.

ఈలాగున నిరాఘాటంగా హరికథ సాగిపోతోంది. ఇరువదిరోజులకు పాండవుల అజ్ఞాతవాసము వరకూ వచ్చింది. విరాటరాజు కొలువులో పంచపాండవుల వింతవర్తనలను అమోఘంగా వర్ణిస్తున్నారు లక్ష్మణదాసుగారు.

రంగమ్మ ఆనందానికంతేలేదు. భర్తను పోరింది. హరికథ మంచి రసకందాయములో ఉంది. నేటి రాత్రి మంచి కథపట్టుంది. వెళ్ళిరమ్మని పోరింది. రంగయ్య వెళ్ళలేనని వెనుకంజవేస్తున్నా భార్యపోరువల్ల వెళ్లక తప్పలేదు. అడ్డుమాట చెప్పటానికి యోచన తట్టక, "నాకు నిద్దర ఆగదే" అన్నాడు.

ఆమె ఏలాగయినా, ఆనాడు భర్తను హరికథకు పంపించితీరాలనుకొంది. "నేను టీ పెట్టిస్తాను త్రాగి వెళ్ళండి"అంది. అతను 'టీ త్రాగితే నిదుర ఆగదు సరికదా, బ్రహ్మాండంగా నిదురపడుతుంద

# ★ భక్తిసాధన ★

న్నాడు. "అయితే శనగలు పోగిచిస్తాను; నిద్రవచ్చినప్పుడల్లా నోట్లో ఒక్కొక్కగింజ వేసుకుతింటూండ" మన్నది.

అందుకు సరే అన్నాడు. అసలు రంగయ్యకి శనగలంటే చాలా యిష్టం. పచ్చిశనగలే పరమాన్నముగా తలచి నెమరువేసేవాడు- అందులోనూ భార్య పోగచిపెడతానంటే-వద్దనగలడా! తప్పకుండా శనగలుగురించేనా హరికథకు వెళ్లాలనుకొన్నాడు; విఘ్నేశ్వరునిమీద భక్తా, ఉండ్రాళ్లమీద భక్తా అన్నట్లు—

రోజూ రాత్రి ఏడుగంటల వరకూ ఉంచే కొట్టును ఆరుగంటలకే కట్టివేశాడు. తిన్నగా యింటికి వచ్చాడు. రంగమ్మ భర్త రాగానే అన్నం వడ్డించింది. భోజనం చేసిన పిమ్మట శనగలు మూటకట్టి యిచ్చింది దాసుగారు ఏమికథ చెప్పారో, అది యింటికివచ్చి తనకు చెప్పాలంది. ఆ షరతుకు అంగీకరించి రంగయ్య హరికథకు వెళ్లాడు.

అక్కడంతా అతనికి వింతగా తోచింది. శుభ్రంగా మంచి జాగా చూసుకొని, స్తంభాని కానుకొని కూర్చున్నాడు. నలుగురూ కథవినటానికివస్తున్నారు వచ్చేవాళ్లనందర్నీ వింతగా చూస్తూ, శనగల మూట విప్పుకు కూర్చున్నాడు రంగయ్య. ఒక్కొక్క గింజే వలుచుకొని తినటమారంభించాడు. వచ్చినవాళ్లందరూ రంగయ్య వింత ప్రవర్తనపరికిస్తూ, దాసుగారు రావటం చూసి కూర్చొన్నారు. హరికథా సభాస్థలిని అంతవరకూ చూసి రంగయ్య నిద్రపోయాడు. మరల దాసుగారు మంగళహారతి గీతాన్ని ఆలాపిస్తూంటే, మృదంగం, వాయులీనం మధురంగా హెచ్చుస్థాయిలో వాయిస్తూంటే రంగయ్యకు మెళకువ వచ్చింది. అందరూ, లేచి వెళ్ళడం చూశాడు.

అందరితోపాటు తనూ యింటికి వచ్చేశాడు. సుమారు రాత్రి ఒంటిగంటయింది. భార్యను పిలవగానే తలుపుతీసింది. కాళ్లు కడుక్కొని మంచంమీద నడుంవాల్చాడు.

దాసుగారు కథ ఏమిచెప్పారో అనే కౌతూహలం కొద్దీ "ఇవ్వాళేం కథ చెప్పారండీ?" అని అడిగింది.

అసలు కథ ఏమైనా వింటేగా భార్యతో చెప్పటానికి! శుభ్రంగా శనగలు ఫలహారంచేసి పడుకొన్నవాడికి కథ ఏమితెలుస్తుంది? మళ్ళీ భార్య తిరుగ ప్రశ్నవేసేసరికి సమాధానం చెప్పక తప్పదనే ఉద్దేశ్యంతో—దాసుగారు హరికథావేదికపై నుంచున్నట్లుగా మంచము మీద నుంచొని, "వస్తున్నారు, వస్తున్నారు, వస్తున్నారూ," అని ఒక చరణం పాడటం మొదలుపెట్టాడు. సరిగా ఆ సమయంలోనే రంగయ్యఇంటికి కన్నంవేయాలని దొంగలు వస్తున్నారు.

రంగయ్య "వస్తున్నారు, వస్తున్నారు" అని బిగ్గరగా పాడగానే వస్తున్నట్లు చూశాడేమోనని దొంగలు భయపడి పెరటిలో ఒక కొబ్బరిచెట్టు మొదట దాగి కూర్చున్నారు.

సరే హరికథలోకి జనంవస్తున్నారని పాడినతర్వాత, జనమంతా కూర్చొనేవరకూ శనగలు తింటూ మెళకువగా ఉన్నాడుకాబట్టి,— "కూర్చున్నారు, కూర్చున్నారు, కూర్చున్నారు" అని రెండవచరణం పాడాడు రంగయ్య. ఇది వినగానే దొంగలు మరీ హడలెత్తిపోయారు. 'మనం రావటమూ చూశాడు, కూర్చోవటమూ చూశాడు. వీడు మెలకువగానే ఉన్నాడు. కన్నంవేయటం, దోచుకోవటం కుదరదు" అనుకొన్నారు. నలుగురుదొంగలూ వెళ్లిపోదామనుకొని తాము తెచ్చుకొన్న పరికరాలన్నీ యథారీతిగా సంచిలోపెట్టుకొని, భుజానవేసుకొని వెళ్ళిపోతున్నారు.

రంగయ్య హరికథ వినటానికి వచ్చినవాళ్లు కూర్చోవడం చూశాడు; మళ్లీ దాసుగారు మంగళహారతి పాడుతుంటే గాని మెళకువ రాలేదు కదా—! మెళకువ వచ్చి చూసేసరికల్లా జనం వెళ్ళిపోవటం కనిపించింది. కాబట్టి, "వెడుతున్నారు, వెడుతున్నారు, వెడుతున్నారు." అని మూడోచరణం పాడేశాడు. దొంగలు నిశ్చేష్టులైపోయారు. 'మనం రావటం చూశాడు, కూర్చోవటం చూశాడు, వెళ్ళిపోవడం కూడా చూశాడు; వీడెవడో దేవాంతకుడులాగున్నాడ'ని వచ్చినదారినే కాలికిబుద్ధి చెప్పారు. ఆనాడు వాళ్ళకు దురదృష్టవశాత్తూ కూర్చోవడం, వెళ్లిపోవడం, అరుగుమీద పడుకొన్న రంగయ్య పాలేరు చూశాడు.

దొంగలు వెళ్ళేటప్పుడు కుక్కలు మొరగటం విని, రంగమ్మ బయటకు వచ్చింది. దొంగలు పారిపోవడం చూసింది.

వీధిలో నుంచే "ఏమండోయ్! మన యింటికి కన్నం వేయటానికి వచ్చిన దొంగ లెట్లా పారిపోయారో చూశారా—" అంది రంగమ్మ.

అంతవరకూ బిక్కుబిక్కుమంటూ పడుకొన్న పాలేరు కాస్త ధైర్యం తెచ్చుకొని "అయ్యగారింత క్రితమే దొంగలు రావటం చూశారమ్మా" అన్నాడు.

"నేను చూడలే" దంటూ రంగయ్య బయటకు వచ్చాడు.

అప్పుడు దొంగలొచ్చిన వేళకు సరిగా 'వస్తున్నా'రని రంగయ్య పాడటం, కూర్చొనేసరికి 'కూర్చొన్నారు'అని పాడటం, వెళ్ళేటప్పుడు 'వెడుతున్నా'రని పాడటం, అంతా సవిస్తరంగా చెప్పాడు, పాలేరు.

రంగయ్యగారు ఆశ్చర్యపోయాడు. భార్యను మభ్యపెట్టుదామనే ఉద్దేశ్యంతో పాడితే, అది దొంగలనుండి రక్షింపబడటానికుపయోగించిందనుకొన్నాడు.

భర్తవాలకాన్ని చూసి, అతనికి భగవంతునిమీద భక్తి పురిగొల్పుదామనే ఉద్దేశ్యముతో—"మీరు గుడికి వెళ్లి హరికథ వినకపోయినా, ఆ కొంతసేపూ గుళ్లో కూర్చొని వచ్చినందు కెంత పుణ్యం సంపాదించుకు రాగల్గేరో గమనించారా?" అంది.

రంగయ్యగారికి లోలోపల ఆశ్చర్యంతోపాటు, భగవద్భక్తికూడా పుట్టుకువచ్చింది. నాటినుంచీ రంగయ్య మహాభక్తుడయ్యాడు. ★

(36-వ పేజీ తరువాయి)

టిరి, మీ పేరేమి,అంతా చెప్పండి. అంతలోపల్నే, మా ఆవిడ వచ్చేస్తుంది.

దేవి: నరుడా! ఏమి నీకోరిక?

రామ: (విసుగుతో) అబ్బే! మీకు, కాస్త ఓపిక లేదూ, దేవీ?

దేవి: నరుడా! ఏమి నీకోరిక?

రామ: నేను, నరుడ్నే లే, దేవీ! కాకపోతే, రాక్షసుడ్నే మీ కాను.

దేవి: నరుడా! ఏమి నీకోరిక?

రామమూర్తి కోపంతో, పొయ్యింటివైపు తిరిగి, "ఏయ్ సరోజా! కాస్త పరుగెత్తిరావే. దేవి డెబ్భై మైళ్ల స్పీడులోవుంది. దేవి ప్రత్యక్షమైనా, నీవు ప్రత్యక్షమయ్యేది కష్టంగావుందే!" అని విసుగుతో దేవివైపు తిరుగుతాడు.

దేవి: నరుడా! ఏమి నీ కోరిక?

రామ: మీది కష్టైనోర య్యుంటె, ఎప్పుడో పగిలిపోను అనే విషయం తెలుసా దేవీ?

దేవి: నరుడా! ఏమి నీకోరిక?

రామ: అబ్బ! మీనాన్న,అమ్మ, మీకు ఆ మాట తప్ప మరేమీ నేర్పలేదా?

దేవి: నరుడా! ఏమి నీ కోరిక?

రామ: అబ్బబ్బ నన్ను చంపేస్తున్నావు.

దేవి: నరుడా! ఏమి నీకోరిక?

రామ: నేను, నరుణ్ణే, తల్లీ.

దేవి: నరుడా! ఏమి నీకోరిక?

పాపం, రామమూర్తికి ఏడుపు వచ్చేస్తోంది. పెళ్ళాము రానేలేదు. ఇక తాళలేక దేవికి సాష్టాంగ ప్రణామములు చేసి,

"దేవీ! తమకు, వెయ్యి నమస్కారములు. ఓ గంటసేపునుంచి నన్ను వేడిపించేశారు. నాపెళ్లాము రానేలేదు. ఎక్కడికెళ్ళిందో ఏమో. మాకేమీ కష్టాలు లేవు. హాయిగా బ్రతుకుతున్నాం. ఇక మీరు నామీద, దయవుంచి పోయి రండి."

ఇలా అని రామమూర్తి భయంతో తలెత్తిచూచాడు. దేవి వెళ్ళిపోయింది "బతికానురా. దేవుడా!" అనుకున్నాడు.

పరుపుమీద పడుకొనివున్న రామమూర్తి మెలుకువవచ్చి దిగ్గున లేచి కూర్చున్నాడు: "అరె! ఇదేమి కలా? లేక దేవి ఇంకా ఇక్కడుందా?" అని కళ్ళు నులుము కొంటూ తల ఎత్తి చూచాడు. "మ్యావ్"అంటూ పిల్లి బావ పరుపు దగ్గరకు వచ్చాడు.

"ఛ! నీ తలదరగ"అంటూ లేచి పిల్లిని ఓ తన్నుతంతే ఓ మూలకు పరుగెత్తిపోయి 'గుర్'మనింది.

రామమూర్తికి కల రావడానికి కారణం వుంది. వెనుకటిరాత్రి సెకండ్ షో పాతాళభైరవి చూసి వచ్చాడు.

పాపం! దేవికి దయగలిగి ఓ మారు, రామమూర్తిని మాట్లాడించి వెళ్ళిపోయింది. ★



జెమినివారి 'అవ్వయార్ లో కె. బి సుందరాంబాళ్.

# అదీ-ఇదీ

—ఎన్నార్.

"వాస్తవిక చిత్రాలా? గుడ్ గాడ్! అవి మాత్రం నాకొద్దు, మరే దైనా భరిస్తా గాని," అన్నాడు ఇవేవల ఒక మిత్రుడు "సినిమాకు వెళ్లేమంటే, ఏదో కాలక్షేపం కోసం, మూడుగంటల సేపు మననీ, మనచుట్టూ ప్రపంచాన్నీ, మన దైనిక కష్టాలనీ మరిచిపోవటం కోసం గాని, ఏదో నచ్చుకుండా మరి కొంచెం జీవితాన్ని వాస్తవంగా చూపించే చిత్రాలు చూసి భరించలేను. మనం రోజూ ఎన్నెన్నో కష్టాలు పడుతూనే వున్నాము. రేపెలా గడుస్తుందా అనే చింత జీవితంలో ఉండనే వున్నది. అదే చింత సినిమాలో కూడా చూడవలసివస్తే, అంతకంటె బాధాకరమైనది ఉండదు," అని నా మిత్రుడు తన అభిప్రాయం వెల్లడించాడు.

నా మిత్రుడు చిన్నవాడేమీ కాదు. కాయకష్టం చేసి జీవనం గడిపేవాడూ కాదు. మధ్యతరగతి కుటుంబీకుడు, చదువుకున్నవాడు. ఆధునిక ఆంగ్ల రచయితల గ్రంథాలతో కొంత పరిచయం ఉన్నవాడు. సారోయాన్, స్టీన్ బెక్, హక్స్లే, మాఘమ్ మొదలైన వారిమీద అపార భక్తి శ్రద్ధలు కలవాడు. అర్ధరూపాయి పెడితే వచ్చే రైల్వే సారస్వతం, డిటెక్టివ్ నవలలు, కార్టూన్ పత్రికలు మొదలైనవాటిమీద ఏవగింపు కలవాడు. ఇటువంటి పెద్దమనిషి చలన చిత్రాల విషయంలో ఇలా మాటాడటం నాకు ఆశ్చర్యం కలిగించింది. నిదానంగా ఆలోచిస్తే ఈవిధమైన 'పారడాక్సికల్' మనస్తత్వం కలవారు దేశంలో ఇంకా పదువురున్నా రనిపించింది. సాహితీ సమితి రోజుల్లో కథకుడుగా పేరుపొందిన ఒక ఆసామీకూడా నాతో ఒకసారి ఇలాగే అన్నారు "నేను ప్రజల్ని నవ్వించడం కోసం, చమత్కారంతో చక్కిలిగింతలు పెట్టడానికి కథలు రాస్తానే గాని, జీవితాన్ని ఉన్నదున్నట్టు చిత్రించడానికి కాదు. అలా వర్ణించే కథలు ఏవన్నా ఉంటే నేను చదవను. జీవితంలో కష్టాలు చాలక, కథల్లో కూడా కష్టాలే చదవాలా?" అని ఆయన ఉపన్యసించారు.

ఈ వాదం వినడానికి బాగానే ఉన్నా,



శ్రీ రాజరాజేశ్వరీ వారి "లక్ష్మి" లో కృష్ణకుమారి.



"అవ్వయార్"లో రాజు పారివల్లల్‌గా ఎమ్. కె. రాధ

## ★ అదీ—ఇదీ ★

లోతుగా ఆలోచిస్తే అలా వాదించేవారు వాస్తవికవాదం సరిగ్గా అర్థంచేసుకున్నారా కళ యొక్క ప్రయోజనం ఇదమిత్థమని తేల్చుకున్నారా, అని సందేహించాల్సి వస్తుంది. పైగాడిరిగా వాదించేవారి సిద్ధాంతాన్ని యింగ్లీషులో 'ఎస్కేపిజమ్' (పలాయనవాదం) అంటారు. వీరు యథార్థమూ, కాంచానికమూ అయిన ఈ జీవితంనుంచి ఊహాజగత్తులోకి పలాయనం చిత్తగించాలంటారు కనుక వీరికి 'ఎస్కేపిస్టు' లనే పేరు వచ్చింది. జీవితంనుంచి పారిపోవడం సాధ్యం కా—, కనీసం కళలోనైనా యథార్థ జగత్తునుంచి దూరంగా పారిపోగలమా అనేది వీరు సావధానంగా ఆలోచించరు. వీరికి కళ కేవలం కళాకారుడి బుర్రలోంచి మాత్రమే ఊడిపడే అపురూపకల్పనా వస్తువుగా కనిపిస్తుంది. ఏ కళాకారుడూ కళ్ళు, మిగతా ఇంద్రియాలూ మూసుకుని తన ఊహాలోంచి దేనినీ సృజించలేడనీ, పిచ్చివాళ్ళూ, స్వప్నావస్థలోని మనుషులూ మాత్రమే అలా సృజించగలరనీ వీరు గ్రహించరు.

* * *

వాస్తవికవాదం అంటే ఏమిటి?

ఈసడించడమే పనిగా పెట్టుకున్న వారు, వాస్తవిక వాదమంటే బీదవాళ్ళకష్టాలు వర్ణించేదనీ, రాజకీయప్రచారం ప్రయోజనంగా పెట్టుకుని కళ అనే ముసుగు వేసుకున్న వాదమనీ చెబుతారు. ఇంతకంటె సంకుచితమైన అర్థం మరొకటుండదు. వాస్తవికవాదం జీవితాన్ని వాస్తవంగా చూసి, చిత్రించమని చెబుతుంది. వాస్తవజీవితం విశాలమైనది, అనంతమైనది. అందులో బీదవాళ్ళ కష్టాలొక్కటే కాదు, ఇంకా ఎన్నో విషయాలున్నాయి. నువ్వు నవల వ్రాసినా, చిన్నకథ వ్రాసినా, ఒక చిత్రం తీసినా ఈ వాస్తవజీవితాన్ని, నీకు చేతనైనంత విశాలంగా చిత్రించమంటుంది. జీవితాన్ని మనం రకరకాలుగా చూస్తాము, అనుభవిస్తాము. ఒకడు ప్రకృతిసౌందర్యం చూసి తన్మయుడౌతాడు, బజార్లో బిచ్చమెత్తుకునే వాణ్ణి చూసి, చూడనట్టుగా వెళ్ళిపోతాడు, జాలికలిగితే వాడికొక కానీ పారవేస్తాడు. అటువంటి బిచ్చగాళ్లు వేనవేలు కనిపిస్తే ఈదారిద్ర్యం పోగొట్టడానికి మార్గమేమిటని ఆలోచిస్తాడు, ఏదన్నా మార్గం కనిపిస్తే దానికోసం నడుం కట్టి పనిచేస్తాడు. మరొకడికి బిచ్చగాళ్లు కనిపించరు. తన ప్రేయసి ఒక్కతే వాడికి ప్రపంచంగా కనిపిస్తుంది, ఆమెకోసమే వాడు జీవిస్తాడు, ఆమె చనిపోతే వాడికి ప్రపంచం శూన్యమౌతుంది, వాడు ఆత్మహత్య చేసుకుంటాడు, లేకపోతే జీవచ్ఛవంలా జీవి

డైరెక్టర్ బిమల్‌రాయ్ మద్రాసు వచ్చినసందర్భంలో ఈనెల 6-వ తేదీన సినీ టెక్నీషియన్స్ సంఘంవారు సన్మానం చేశారు. ఫొటోలో నుంచున్నవారు బిమల్‌రాయ్

స్తాడు, లేక, తన ప్రేయసి కాక, ఇంకా ఎంతో ప్రపంచం వున్నదనీ, ఆ ప్రపంచంలో తనలాటివాళ్లు ఎందరో వున్నారనీ, వారికోసం తను బ్రతకవచ్చుననీ ఆలోచన చేస్తాడు ఇట్లాగ జీవితంలో అనంతమైన వైవిధ్యం గల మన స్తత్వాలు ఉన్నాయి ఇదంతా యథార్థమే, ఇదంతా వాస్తవమే ఈ వాస్తవాన్ని చిత్రించమంటుంది వాస్తవిక వాదం

వాస్తవాన్ని చిత్రించవలసిన అగత్యం ఉన్నదా? ఉన్నదని ప్రతి కళాకారుడూ ఒప్పుకుంటాడు లేదనేవాడు కళాసృష్టి చెయ్యాలనే యావపెట్టుకోడు సర్కస్ కంపెనీ పెట్టి పెద్దపులుల్ని ఆడిస్తాడు, లేక, ఏదో ఉద్యోగంతో సంతృప్తి పడ



బిమల్‌రాయ్, సన్మాన సభాధ్యక్షుడు మేకప్ హరిబాబు. →



యునైటెడ్ సినీపయనీర్స్ & శ్యామలా వారి "పల్లెపడుచు" లో ముక్కామల కృష్ణమూర్తి.

## ★ అదీ—ఇదీ ★

...ము. అయితే కళాకారుడికి కళ సృజిం...గాలనే యావ ఎందుకు వస్తుంది?

రోజూ సూర్యు డుదయిస్తున్నాడు; అస్తమిస్తున్నాడు మనలో ఎంతమంది సూర్యోదయాస్తమయాలు చూసి ఆనందిస్తున్నాము? ...నకి చూసే తీరికవుండదు, ఓపికవుండదు, ...చాలనే భావమే కలగదు కళాకారుడు ...దయ సంధ్యా సౌందర్యం చూసినప్పుడు, ...వశ్యతపొంది, "ఈ సౌందర్యం నాతోటి ప్రజలెందుకు అనుభవించకూడదు?" అని ఆవేదన పడతాడు తన సౌందర్యానుభూతిని తోటి ప్రజలకుకూడా పంచియివ్వాలనే కాంక్షతో కళాసృష్టి చేస్తాడు తన అనుభూతిని తోటివారితో పంచుకోకూడదు, తనకూ తోటి వారికీ ఏమీ సంబంధం లేదనుకునే వాడికి కళతో ప్రమేయం ఉండదు కళాకారుడు తన కళ "సోదరులంతా పంచుకునే వెలుగుల రవ్వల జడి" అని భావిస్తాడు కొన్నేళ్ల క్రిందట పిర్యెవ్ అనే రష్యన్ డైరెక్టరు తీసిన "టేల్ ఆఫ్ సైబీరియా" అనే వర్ణచిత్రం చూశాను. ఆ చిత్రంలో నాయిక, నాయకుడు ఒక ఎత్తైన ప్రదేశం మీద నుంచుని సంధ్యాశోభ తిలకిస్తారు. ఆ రెండు మూడు దృశ్యాలలో డైరెక్టరు ఎంత కవిత్వం, ఎంత 'లిరిసిజమ్' ఇమిడ్చిపెట్టాడో చెప్పలేను ఆ కాస్సేపు కీట్సు ప్రకృతివర్ణన చదువు తున్నట్టనిపించింది

అయితే కళాకారుడు ప్రకృతిలోని సౌందర్యం మాత్రమే చూసి వూరుకోడు ప్రకృతికంటె తనకు సన్నిహితమైన మానవ ప్రపంచాన్ని కూడా పరిశీలిస్తాడు మానవుల కష్టసుఖాల్లో తనుకూడా పాల్గొంటూ, వాటిని తన తోటివారికి పంచియివ్వడానికి ప్రయత్నిస్తాడు. ప్రతి మహాకవిలోను, గొప్ప నవలా రచయితలోను ఈ ప్రయత్నం కనిపిస్తుంది మనం ప్రతిరోజూ చూసే సంఘటనలనే కళలో తిరిగి దర్శించినప్పుడు, ఆ సంఘటనల వెనకదాగిన అంతరార్థాలు గోచరిస్తాయి మన పూర్వకవులు, షేక్స్పియరు వంటి పాశ్చాత్య కవులు అంతా, తమ తమ కాలాల్లో తాము దర్శించిన వాస్తవ జీవితాన్నే వర్ణించారు వాస్తవ జీవితానికి ఏ మహాకవీ దూరంగా పారిపోలేదు.

ఇక ఈనాడు కళాకారులు చెయ్యవలసిన పని యేమిటి? ఈరోజున మన చుట్టూ వున్న వాస్తవ జీవితాన్ని తమ కళలో చిత్రించవలసిన బాధ్యత వారిపై వున్నది కళలు అనేక విధాలయినా అన్నిటికీ తత్వం ఒకటే కనుక ఈ వాదం చలన చిత్రాలకు కూడా వర్తిస్తుంది వాస్తవ జీవితంలో బీదవాళ్లుంటే, వారు కష్టాలు పడుతుంటే, కళాకారుడు అదే తన కళలో చూపించాలి లేక ప్రేయసీ ప్రియులు కనిపిస్తే వారిని చిత్రించాలి తనకు కనిపించే యథార్థాన్ని కళాకారుడు ప్రతిబింబించినంత కాలమూ, అతని కళ వాస్తవికమే అవుతుంది

* * *

అయితే చలనచిత్రాలు ఈ పని ఎంతవరకూ చేస్తున్నాయి? అమెరికాలో తయారయే చిత్రాల్లో నూటికి 48 దొంగతనాలు, హత్యలు, ఇత్యాది నేరాలు చూపించే చిత్రాలని ఒకరు అంచనా వేశారు అమెరికాలో జరిగేటంత నేరం ప్రపంచంలో మరే దేశంలోనూ జరగదని అందరికీ తెలిసినదే కాని అటువంటి అమెరికాలో కూడా నేరగాండ్ర సంఖ్య నూటికి 48 ఉంటుందా? ఉంటే అక్కడి సాంఘిక జీవనం ఎప్పుడో నాశనమైపోయేది నూటికి ఒకరో, ఇద్దరో నేరస్థులు

ఉంటే ఉండవచ్చునని ఒప్పుకుందాము. అందుచేత అమెరికన్ చిత్రాలు వాస్తవ జీవితాన్ని యథాతథంగా కాక వికృతం చేసి చూపిస్తున్నాయన్న మాట.

భారతీయ చిత్రాలు తీసుకుందాము. భారతీయ చిత్రాల్లో నూటికి తొంభయి పైగా ప్రేమచిత్రాలు. ఈ చిత్రాలన్నీ ఒకదానికొకటి ప్రతిధ్వనులు. పేర్లుమార్చి, స్థలాలుమార్చి, కాలాలుమార్చి అవే కథలు; అవే సమస్యలు. ఏ చిత్రంలో చూచినా ప్రేమించడం తప్ప మరో పనిలేని నాయకుడుంటాడు. వాడికి ఒక ఉద్యోగం ఉండదు, ఒక ఊరుండదు, ఒక అస్తిత్వం ఉండదు. ప్రతి చిత్రంలోనూ, ప్రేమించబడడం తప్ప వేరు పనిలేని కథానాయిక ఉంటుంది. ఈ నాయికా నాయకులు ఏదో స్వప్నంలో సంచరిస్తున్న వాళ్లలాగ కనిపిస్తారు. ఇటువంటివాళ్లు జీవితంలో ఎక్కడా తగలరు.

మన నిర్మాతల దృష్టిలో స్త్రీ పురుషుల మధ్య ప్రేమసంబంధం తప్ప మరే సంబంధమూ ఉండడానికి వీల్లేదు. కాని కాలం మారింది, పరిస్థితులు మారాయి. స్త్రీ ప్రేమించబడడానికి, పిల్లల్ని కనడానికి తయారుచేయబడిన యంత్రం కాదనే భావం సర్వత్రా వ్యాపిస్తోంది. స్త్రీకి కూడా సంఘంలో సమానస్థాయి, వివాహ స్వాతంత్ర్యం, విద్య, పనిహక్కులు, అవసరమనే భావం గుర్తించబడుతోంది. ఇదంతా ఏ చిత్రంలోనూ కనిపించదు. ఒక స్త్రీని ఇద్దరు పురుషులు ప్రేమించడం, ఇద్దరు స్త్రీలు ఒక పురుషుణ్ని ప్రేమించడం - ఈ చవక సన్నివేశాలతో కథలు అల్లబడుతున్నాయి. స్త్రీ పురుషుల మధ్య ఆర్థిక సంబంధం, సిద్ధాంతాల్లో, దృక్పథాల్లో భేదాలు, కుటుంబ పోషణ, పిల్లల పెంపకం, ఇటువంటి కథావస్తువుల జోలికి ఎవరూ వెళ్లడంలేదు. ముఖ్యంగా మనదేశానికి వేరుపురుగుల్లాగ తయారైన, కుల మత, వర్గ విభేదాలు, వీటివలన సంఘం ఎలా అరలు అరలుగా చీలిపోతున్నదీ, వీటినెలా పరిష్కారం చెయ్యడం, ఇత్యాది వస్తువులకు కూడా మనవారు దూరంగా ఉండిపోతున్నారు.

సాంఘిక సమస్యలను చిత్రించడానికి ప్రయత్నించిన చిత్రాలు పూర్తిగా లేక పోలేదు. వీటిని వేళ్లమీద లెక్కపెట్టవచ్చును. అయితే ఈ కొద్ది చిత్రాలుకూడా వాస్తవిక చిత్రణంలో విఫలమవుతున్నాయి. వాటి కథకులు, దర్శకులు మానవస్వభావాన్ని పైపైనచే గాని, లోతుగా అర్థం చేసుకున్న వారు కాకపోవడమే దీనికి కారణం. కూతురు తన యిష్టం వచ్చినవాణ్ణి



పారమౌంట్ వారి టెక్నికలర్ చిత్రం "బ్లేజింగ్ ఫారెస్ట్" లో జాన్ పేన్, సూసన్ మార్లో.

పెళ్లిచేసుకుంటానంటే ఒప్పుకోని తండ్రి, ఆడపిల్ల చదువుకుంటానంటే అంగీకరించని తండ్రి, ఉద్యోగం తీసివేసే యజమాని, అనేకమంది రైతుల కష్టంమీద బ్రతికే జమీందారు—వీరందరినీ మన కథకులు కొంత తడిమిచూశారు. కాని మన కథకులకు రెండు రకాల పాత్రలతోనే పరిచయమున్నది, దుర్మార్గులు, సన్మార్గులు. కథానాయకుడు మంచివాడైతే వాడికి అడ్డం వచ్చే వారంతా నరరూప రాక్షసులు. మంచివారంతా నరరూప దేవతలు. కాని జీవితంలో ఏ వ్యక్తీ పూర్తిగా మంచివాడూ, పూర్తిగా చెడ్డవాడూ, అయి వుండడు. ప్రతి పనికీ వెనుక ఒక కారణం, ఒక 'మోటివ్' వుంటుంది. ఇలా యథార్థ సంఘటనల అంతరార్థాలను చూపడానికే కళాకారుడు ప్రయత్నించాలి. అప్పుడే వాటికి వాస్తవికత సిద్ధిస్తుంది. ఈ ప్రధాన విషయం మరిచిపోయి మన కథకులు 'మెలోడ్రమెటిక్' పాత్రలతో సంతృప్తి పడుతున్నారు.

ఇంతవరకూ వాస్తవిక వాదానికి ఎంత విశాలమైన అర్థం వున్నదో చూశాము. నా మిత్రుడి విమర్శకు కొంతవరకూ సమాధానం చెప్పగలిగానను కుంటాను. బీదవాళ్ల కష్టాలను చిత్రించిన ప్రతిచిత్రమూ వాస్తవిక చిత్రమైపోదని కూడా అనుకున్నాము. ఇటీవల "భోర్ హోయే ఏలో" అనే బెంగాలీ చిత్రం విడుదలయింది. దానిలో బీదవారి జీవితం ఒక్క కాంతిరేఖ కూడా చొరని అంధకారంతో ఎండినదిగా చూపించబడిందని విమర్శకులు విమర్శించారు. వ్యక్తి ఎంత దారిద్ర్యంలో బాధపడుతున్నవాడయినా, కేవలం నిరాశాంధకారంలో బ్రతకడంలేదు. అతనికీ సంతోష సమయాలుంటాయి, భవిష్యత్తుమీద ఆశ



“లవ్వాయ్యాక్” లో యౌవనంలో లవ్వాగా సులోచనా.

## ★ ఆదీ—ఇదీ ★

ఉంటాయి; ఆశలు సఫలం చేసుకోవడానికి ప్రయత్నిస్తారు; ఎన్నిసార్లు విఫలులైనా ప్రయత్నం మానరు. అలా నిరాశల సమ్మేళనం జీవితం. వాస్తవిక కళ అటువంటి జీవితాన్ని చిత్రిస్తుంది.

అటువంటి జీవితంయొక్క చిత్రణం కూడా భరింపలేనివాళ్ళు, కళకు సాధ్యమైనంత దూరంగా ఉండడం మంచిది. కళలో వినోదానికి, కాలక్షేపానికి తావులేదని నా అభిప్రాయం కాదు. వాస్తవిక కళలో 'ఎంటర్‌టెయిన్‌మెంట్' తప్పక వుంటుంది. కాని వినోదింపజేసేది ప్రతిదీ కళ కాదు. కేవలం జీవితంనుంచి పలాయనం చెయ్యగోరేవారు డిటెక్టివ్ నవలలు, చవకబారు రొమాన్సు పత్రికలూ చదువుకుంటారు; సర్కస్‌లో భయానక ప్రదర్శనాలు చూస్తారు; సినిమాల్లో అర్ధనగ్న యువతుల నృత్యాలు చూస్తారు. వారికి సంతృప్తి కలుగుతుంది. కాని కళాకారుడు సంతృప్తిపడడు. తన అనుభూతులను సోదరులకు పంచియివ్వడానికి, ప్రపంచంలో సౌందర్యాన్ని, సౌఖ్యాన్ని పెంపొందించడానికి ప్రయత్నిస్తూనే వుంటాడు. ఆ ప్రయత్నం ఒక సాధన, ఒక తపస్సులాంటిది. ★

## వెనిస్ చలనచిత్రోత్సవం

ఈ ఏడాది వెనిస్‌లో జరిగిన అంతర్జాతీయ చలనచిత్రోత్సవంలో 30 చిత్రాలు ప్రదర్శింపబడ్డాయి. వీటిలో ఏదీ "గ్రాండ్ ప్రైజ్"కు అర్హమైనదిగా కనిపించలేదని జడ్జీలు భావించారు. కాని నిర్మాతలు, దర్శకులు అయిన ఎనిమిది మందికి బహుమతులు ఇచ్చారు. "మౌలిన్ రూజ్" చిత్రం డైరెక్ట్ చేసిన బ్రిటిష్ డైరెక్టరు జాన్ హస్టన్, జాపనీస్ డైరెక్టరు కెంజీ మిజోగుచీ, ఇటాలియన్ డైరెక్టరు ఫెడరికో ఫెలినీ, ఫ్రెంచి డైరెక్టరు మార్సెల్ కార్నెట్, రష్యన్ డైరెక్టరు అలెగ్జాండర్ ప్టుష్కో ఈ బహుమతులు పొందారు. ఉత్తమ నటి బహుమతి "ఫోర్ పోస్టర్"లో నటించిన లిలీ పామర్, ఉత్తమ నటుని బహుమతి ఫ్రెంచి నటుడు హెన్రీ విల్బర్ట్ స్వీకరించారు.

## "సౌండ్ బారియర్"

బ్రిటిష్ చిత్రం "సౌండ్ బారియర్" ఈమధ్య మద్రాసు వచ్చింది. "గ్రేట్ ఎక్స్‌పెక్టేషన్స్" మొదలైన ఉత్తమ

(56-వ పేజీ చూడండి)

# సినిమా వార్తలు

సెన్సార్ బోర్డు వారి మద్రాసు ప్రాంతీయ అధికారి శ్రీ ఎస్ ఎ అయ్యర్ మరొక ఉద్యోగానికి బదిలాయించబడ్డారు మరొక అధికారి నియమించబడే వరకూ ఆయన స్థానంలో శ్రీ వి ఎస్ ప్రాసా పని చేస్తున్నారు

*　　*　　*

మద్రాస్ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి "రోహిణి" ద్విభాషా చిత్రం పూర్తికా వచ్చింది. ఇంకా కొద్ది 'పాచ్ వర్క్' మిగిలివుంటే పూర్తిచేస్తున్నారు ఫైనల్ ఎడిటింగ్ కూడా మొదలుపెట్టారు అక్టోబర్లో విడుదల చేయవచ్చునని తెలుస్తున్నది మాధురీదేవి, జి వరలక్ష్మి, సహస్రనామం, ఎస్ వి. రంగారావు మున్నగువారు నటిస్తున్నారు.

*　　*　　*

ప్రధాని నెహ్రూ కుమార్తె శ్రీమతి ఇందిరా గాంధి ఇటీవల రష్యాలో పర్యటించి తిరిగి ఢిల్లీ వచ్చినప్పుడు, తాను మాస్కోలో వుండగా ఒక 'త్రీ-డీ' చిత్రం చూచాననీ, ఆ చిత్రానికి పోలరాయిడ్ కళ్లజోళ్లు ఉపయోగించ నవసరంలేదనీ చెప్పింది (అమెరికాలో తయారయే 'త్రీ-డీ' చిత్రాలకు విధిగా కళ్లజోళ్లు ఉపయోగించాలి )

*　　*　　*

జెమినీవారి "అవ్వైయార్" ఈ నెల 7వ తేదీన న్యూఢిల్లీ, ఫిలిమ్స్ డివిజన్ థియేటర్లో ప్రత్యేకంగా ప్రదర్శించబడింది భారత్ ఉపాధ్యక్షుడు శ్రీ ఎస్. రాధాకృష్ణన్, బి వి కేస్కర్, అనంతశయనం అయ్యంగార్ మున్నగు ప్రముఖులు హాజరయ్యారు. చిత్రం చాలా బాగుందనీ, ఇతర భాషల్లోకికూడా ఆ చిత్రాన్ని తర్జుమా చేసి నిర్మిస్తే బాగుంటుందనీ అందరూ అభిప్రాయపడ్డారట

*　　*　　*

న్యూ ప్రీమియర్ ఫిలిమ్స్ అనే బొంబాయి కంపెనీకి బ్రిటిష్ దర్శకుడు హెర్బర్ట్ మార్షల్ "వజీర్ ఆలీషా" అనే ఇంగ్లీషు, హిందీ భాషల చిత్రం డైరెక్టు చేస్తున్నాడు. కథ, ఇంగ్లీషు డైలాగులు మార్షల్, ముల్కరాజ్ ఆనంద్ కలిసి వ్రాశారు స్క్రీన్ప్లే, హిందీ డైలాగులు కామిల్ రషీద్ అనే ఆయన వ్రాశాడు. నాయకపాత్ర అశోక్ కుమార్ ధరిస్తున్నాడు వీణ, కరణ్ దివాన్, ఓమ్ ప్రకాశ్, లలితా పావర్, జెనిక్ మొదలు ప్రసిద్ధ తారాగణంతో, ప్రసిద్ధచిత్రకారుడు ష్యావక్స్ చావ్డా కళాదర్శకత్వంతో, ఉస్తాద్ అలీ అక్బర్ సంగీత దర్శకత్వంతో ఈ చిత్రం ఉత్తమ చారిత్రకచిత్రం కావచ్చునని అనుకుంటున్నారు ★



ప్రకాశ్ వారి "చైతన్యమహాప్రభు" లో భక్తితన్మయతలో భారత్ భూషణ్.

# ప్రశ్నలు - సమాధానాలు

శ్రీ ఎమ్. మాణిక్యరావు—సికింద్రాబాదు

భరణీవారి "చండీరాణి"లో భానుమతి చండి - చంప పాత్రలను నటిస్తూ, కొన్ని సీనులలో ఒకరినొకరు కలుసుకొని మాట్లాడడము సంభవిస్తుంది అట్టి సన్నివేశాలను ఎట్లు ఫిల్ముతీస్తారో తెలుప ప్రార్థన.

—అటువంటి దృశ్యాలను 'మాస్క్' పద్ధతిలో తీస్తారు ముందు, కామెరా లెన్సును కొంతవరకూ మాస్క్ చేసి, ఒక వ్యక్తి ఎదురుగావున్న ఎవరితోనో మాట్లాడుతున్నట్లున్న దృశ్యాన్ని షూట్ చేస్తారు. అలా ఎక్స్పోజు చెయ్యబడిన ఫిలిమును మళ్ళీ మొదటికి తెచ్చి, మళ్ళీ మాస్క్ చేసి ఆ వ్యక్తే ఇందాక నుంచున్న స్థానానికి ఎదురుగా నిలబడి, రెండవ పాత్రతో మాట్లాడుతున్నట్లు షూట్ చేస్తారు ఈ ఫిలిమును ప్రింటు తీసినప్పుడు ఒక వ్యక్తే రెండు పాత్రలు ధరించి సంభాషిస్తున్నట్లు కనిపిస్తుంది

*　　*　　*

శ్రీ కె వెంకోబరావు—ఆదవాని

"పల్లెటూరి పిల్ల"లో చదువుకున్న వసంతి చదువురాని పల్లెటూరి పుల్లయ్య వలలో పడినదని చెప్పినంత మాత్రాన ఆమె అత్తగారు, భర్త నమ్ముట సహజమా?

—కొన్ని సమయాల్లో ఎవరైనా నమ్మడం సహజమే ఆ విషయాన్ని బాగా 'ఎస్టాబ్లిష్' చెయ్యలేకపోవడం, లోపం కావచ్చు

*　　*　　*

శ్రీ ఎమ్. లక్ష్మణరావు—బొబ్బిలి

సినిమాలపై ప్రజలకు కొంతకాలానికి మోజు తగ్గి, సినిమా పరిశ్రమ అడుగంటుతుందని మా మిత్రుడంటాడు నేను దానిని ఖండిస్తున్నాను మీరేమంటారు?

—చవకగా కాలక్షేపం సప్లయి చేసే సాధనం మరొకటి లేనంత కాలమూ సినిమాలపై ప్రజలకు మోజు తగ్గదు.

*　　*　　*

శ్రీ యస్ నరసింహం—ప్రొద్దుటూరు.

వినోదావారి "స్త్రీసాహసం," "శాంతి" చిత్రాలు ఎక్కువ విజయము సంపాదించలేకపోవడం, "దేవదాసు" విజయము పొందుటకు కారణము ఏమిటి?

—"దేవదాసు"లో మంచి కథ, 'ఎంటర్ టెయిన్ మెంటు,' మంచి నటన అన్నీ సమకూడినవి గనుక

*　　*　　*

శ్రీ సి. హెచ్. సుబ్రహ్మణ్యం—విజయవాడ.

సినిమా సర్టిఫికెట్లలో *U* సర్టిఫికెట్లు *A* సర్టిఫికెట్లు అని మార్చిఇచ్చుటకు కారణమేమి?

—ఇతర దేశాలనుండి వచ్చే చిత్రాల్లో కొన్ని, సెక్స్ అపీలు అధికంగా వున్నవి, విపరీతమైన భయం, ఉద్రేకం కలిగించేవి బాలబాలికలు చూడడం మంచిదికాదనే వుద్దేశ్యంతో సెన్సార్ అధికారులు ఇలా రెండురకాల సర్టిఫికెట్లు యిస్తారు 'ఎ' సర్టిఫికెట్ గల చిత్రాలు వయోజనులు (*Adults*) మాత్రమే చూడదగినవి 'యు' సర్టిఫికెట్ గలవాటిని అందరూ (*Universal*) చూడవచ్చును.



అర్ధరాత్రివేళ ఖ్యులనుండ మేల్కొన్న ఎందనరాజు తొలిసారిగా గౌరిని చూస్తున్నాడు

**విజయావారి "చంద్రహారం"లో శ్రీరంజని, ఎన్ టి రామారావు**



# కాలక్షేపం



(3-వ పేజీ తరువాయి)

కారు బారెడు దూరమైనా నడవదు తైలం నిలేదే ఏ అధికారి కచ్చేరీ అయినా గబ్బు పొదలాగున ఉంటుంది తైలం లేకపోతే, ఫైలులో కాగితాలు జైలులో ఉన్నట్లు పడివుంటాయి తైలంతో ఉంది భూతలం అనేది ప్రపంచ పంచతంత్ర సూత్రం ఈ సూత్రకారుని ధిక్కరించే అధికారి ఉండదు స్నేహం లేని జ్యోతి ఆరిపోతుంది ఈ స్నేహజ్యోతి వెలిగినంత కాలమే రాజనీతి. స్నేహజ్యోతి ఆరిపోతే, ఆ దేశానికీ యీ దేశానికీ, పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుంది. విరోధాలు, ఆయుధాలు, యుద్ధాలు సిద్ధమవుతాయి. కనుక స్నేహం వృద్ధికావడం అవసరం అదే రాజనీతి విభూతి

ఐక్యరాజ్యసమితి అంటే ఏమిటి? అఖిల ప్రపంచ రాజ్యాల మధ్య యుద్ధాలు సంభవించకుండా సంఘర్షణలు వృద్ధికాకుండా సర్దుబాటు చేయడానికీ, - ఖ్యత వృద్ధికావడానికీ, అంతర్జాతీయ రాజకీయ రథ చక్రాలకు తైలం వేసి కందెన పెట్టుచుండుటకు కల్పింపబడిన కార్యాలయం అమెరికావంటి పెద్ద రాజ్యాలు యీ తైలమంత్రోపాసన చేసినట్లుగా యితర రాజ్యాలు చేయడంలేదు. రాముల వారి సంకీర్తన ఎక్కడ ఉంటే అక్కడే నేను చేతులు నెత్తిమీద జోడించి నమస్కరిస్తాను. అని ఆంజనేయులు అన్నారు "యత్రయత్ర రఘునాథ కీర్తనం తత్ర తత్ర కృతమస్త కాంజలిం" అన్నట్లుగా ఎక్కడెక్కడ తైలం ఉంటే, అక్కడక్కడ అమెరికా హాజరవుతోంది. పరిషియాకు అనేకకోట్ల డాలర్లు ద్రవ్యసహాయం ఆంజనేయులవారిసహాయంలాగున అమెరికా చేస్తోంది ఈ ఆంజనేయ సహాయానికి కారణం ఏమిటని అంజనం వేసిచూస్తే, పరిషియా దేశంలో బ్రహ్మాండమైన కిరసనాయిలుగనులు ఉన్నాయి. ఇంతకన్నా చక్కని స్నేహావకాశం (చమురు లభించే అవకాశం) ఎంత వెతికి చూచినా వారికి మరొకటి కన్పించలేదు "పమస్తాశావకాశం బులన్" ఈ కిరసనాయిలు గనులను త్రవ్వుకొని, ఆ కిరసనాయిలును అమ్ముకొని, అపార లాభాలు అమెరికా వారు తీస్తున్నారు బ్రిటిష్‌వారు కూడా తీస్తున్నారు ఆ గనులలోని తైలమును పరిషియా ప్రభుత్వమే ఉద్ధరించి శుద్ధిచేసి, వృద్ధిలోనికి రావాలని పరిషియా ప్రభుత్వం కోరింది. ప్రధాన మంత్రియైన మొసాదిక్ యీ విషయంలో పట్టుదలతో గట్టిగా వాదించాడు కాని, మొసాదిక్కు దిక్కు మొక్కు లేకుండా ఒక్క అర్ధరాత్రిలో అధికారహీనుడై అంతర్ధానమైనాడు ఇక అమెరికా పరిషియాల స్నేహం ప్రవర్ధమానమవుతోంది పరిషియా దేశాన్ని ప్రస్తుతపు పరిషియా ప్రభుత్వాన్ని బలిష్ఠంగా చేయడానికీ, అమెరికా వారి ద్రవ్యము అపార పారావారంగా పరిషియాకు ప్రవహిస్తోంది అటు అమెరికా వారి తైలం యిటు ప్రవహిస్తే, ఇక పరిషియా తైలం అమెరికాకు ప్రవహిస్తుంది ఈ విధంగా అంతర్జాతీయ స్నేహం వృద్ధిఅవుతోంది

అయితే, యింత కిరసనాయిలు దాహం అమెరికాకు ఎందుకు? ఇంగ్లండు కెందుకు? విమానాలు నడవాలంటే పెట్రోలు కావాలి - మోటార్లు నడవాలంటే పెట్రోలు కావాలి యుద్ధరంగంలో ఫిరంగి మోటార్లు(టాంకులు) పెట్రోలు త్రాగి జ్వాలలు కక్కుతాయి యుద్ధనావలుకూడా పెట్రోలుతో నడుస్తాయి జలాంతర్గాములన్నీ పెట్రోలుతో నడుస్తాయి ఒక్కముక్కలో చెప్పవలెనంటే, ఎటువంటి యుద్ధంలోనైనా తైలం తక్కువైనవాడు తిలోదకాలు యివ్వవలసిందే తైలం లేనివాడు తెల్లజెండా ఎత్తవలసిందే అందువల యీ స్నేహం సమృద్ధిగా ఉంటే నే సంగ్రామం సమర్థంగా సాగుతుంది స్నేహాకాంక్ష ఎందుకయ్యా అంటే కలహం కోసం

ఆ విషయం ఎట్లా ఉన్నప్పటికీ, యీ కిరసనాయిలు గనులలోని కిరసనాయిలు తీసి అమ్మి అమెరికా యింగ్లండులు అర్జించే లాభాలతో ఆ దేశాలు వృద్ధిలోకి వచ్చి, ఆ దేశాల ఖ్యాతి అఖండజ్యోతిగా వెలుగుతూ ఉంటుంది అందుచేత నే అంత దాహం, అంతులేని దాహం తైలమును త్రాగే టటువంటి దానిని "తైలపాయి" అంటారు అనే గబ్బిలం అని అడుగుపెట్టిన స్థలం అమంగళం

అమెరికా అంటే అమరలోకం అంటారు కాని, యీ తైలదాహం పూర్వజన్మవాసనగాగున అమెరికా వారికి అంటుకొని వెంటాడుచున్నది ఇంటి పేరు కస్తూరి వారైనా ఇంట్లో గబ్బిలాల కంపు అన్నట్లుగా ఉంది తైలపాయి ప్రవేశించిన చోట, అమంగళం అని అర్యులెందుకన్నారో అంతర్జాతీయ వ్యవహారాలలో అవగాహన అవుతోంది

కాశ్మీరులో కూడా అమెరికనులు అడుగుబెట్టితే కొంత అమంగళం జరిగిందనిన్నీ, అబ్దుల్లాను (కాశ్మీరు ప్రధానిని) అనుమానించి ఆయనకు అధికార పీఠంలో నుంచి అర్ధచంద్ర ప్రయోగం చేయవలసి వచ్చిందనిన్నీ కొంత గబ్బు కంపు కొట్టింది.

అమెరికా అంటే అఖిల ప్రపంచ అంతర్జాతీయ రాజనీతికి పీఠంగా ఉంది అపూర్వ రాజనీతి పీఠం ఇది అదే సత్యం. అదే అసత్యం

"అ" పూర్వమందు చర్చి తీచాలి. సత్యం అనేది అపూర్వ సత్యం అవుతుంది. పూర్వమెప్పుడూ లేని సత్యం ఏదో అదే అపూర్వ సత్యం "అ" పూర్వమందు గల సత్యమేదో అది అసత్యం పరుషోక్తి అనేది అపూర్వ పరుషోక్తి అయితే అదే అపరుషోక్తి అదే సరసభావ అపూర్వమైన హింసయే అహింస అమెరికావారి అపూర్వలోభమే, వారి ఈవి వారి అపూర్వ కనకసంగ్రహమే వారి వ్యయము ఇతర దేశాలయెడల వారి అపూర్వమిత్రభావమే అమిత్రభావమని అన్వయించవలసి వస్తుంది అమెరికా అంటే నే, "అ"పూర్వ(పశ్చిమ)దేశంగా ఉంది ప్రపంచంలోని అన్ని రాజ్యాలలోనూ అమెరికవంటి రాజ్యం. అదే అమెరిక అయింది యుద్ధానికి సదా మసాయిదా తయారుచేస్తుంది యుద్ధాలు రాకుండా నివారించడానికి ఆటంబాంబులు తయారుచేస్తున్నానని అంటుంది "వార్" అంటే యింగ్లీషులో యుద్ధం అని అర్థం యుద్ధప్రియుల ప్రేమ "వార్ రమణుల ప్రేమ" అమెరికా అక్షరలక్ష. "వార్" కాదు అదిరష్యామీదనవాల్. అమెరికా రాజనీతి మహాగాధగా, అగాధంగా ఉంది అందుకనే "వార రమణీకైవడి బహురీతి రాజనీతి" అని సర్వకాల సమయానుకూల సూత్రప్రాయంగా భర్తృహరి యను రాజర్షి నిరుపమానమైన ఉపమానంతో రాజనీతి సారసంగ్రహ స్వరూపమును నిరూపించి పై పద్యంలో నిర్వచనంగా నిర్వచించాడు ★

"మీ యింట్లో కత్తెర వుందాండీ, మా అమ్మ పట్టుకు రమ్మంది."

పొరుగింటావిడ: "మీ యింట్లో వుందిగా ఒక కత్తెర?"

"ఉందిగాని, దాంతో సీనారేకు కత్తిరిస్తే పాడైపోతుందని, మీది పట్టుకురమ్మంది."

# ★ పెద్దమనుషులు ★

(20-వ పేజీ తరువాయి)

గమనించటంలేదు అందరూ నన్ను వొత్తిడి చేసేవారే - యితరులు చేసిన మోసాన్ని - నా అసమర్థతగా యెంచి హేళన చేస్తున్నారు. ఆఖరికి రాజ్యంకూడా నా అవస్థ కనిపెట్టకుండా అదోరకంగా మాట్లాడుతుంది" జగన్నాధం తల దిమ్మెక్కిపోయింది లేచి పక్క దులుపుకొని పండుకొన్నాడు. నిద్రపడితే బాగుండుననుకుంటూ దుప్పటి ముసుగుపెట్టుకొని కళ్ళు మూసుకున్నాడు "సుబ్బరామయ్య వచ్చి ఏమంటాడో - ఏమంటే ఏమని సమాధాన మియ్యాలి." ఎంత ప్రయత్నించినా ఆ వూహలనుంచి అతనికి విముక్తి కలుగలేదు ఉక్క పోస్తోంది. దుప్పటి తొలగించి కళ్ళు తెరిచాడు రాజమ్మ ఎప్పుడు వచ్చిందో పిల్లవాని పక్కలో పండుకొని నిద్రపోతోంది "దీనికేం నిశ్చింతగా నిద్రపోతుంది—" భార్య అంత త్వరగా నిద్రపోవటం అతనికి యిష్టంలేదు తన బాధ ఎవరితో చెప్పుకోవాలి - ఆమెను లేవగొట్టపోయి - మరలా ఏమనుకున్నాడో - లేచి కూర్చుని బీడి ముట్టించాడు రెండు గుక్కలు పీల్చి - బీడి ఆర్పి పారేసి - పండుకొన్నాడు. నిద్ర పడితేగా - సుబ్బరామయ్య ఏమంటాడో - ఏమో - తెల్లవారిందాకా పక్కమీద అటూ యిటూ దొర్లుతూ - కలతనిద్రతో గడిపాడు

మరునాటి మధ్యాహ్నం సుబ్బరామయ్య రానే వచ్చాడు అతన్ని చూడగానే జగన్నాధం గుండె ఝల్లుమన్నది మామూలు కుశలప్రశ్నలైనాక అతడు సుదర్శనమ్మ దగ్గరకు వెళ్ళాడు ఆమె అన్ని విషయాలు చెప్పేస్తోంది మామయ్య తనపై విరుచుకపడే ప్రమాదం త్వరలో రావచ్చు - "అనుకుంటూ ఆందోళనతో నిండిన మనస్సుతో అటూ యిటూ పచారు చేస్తున్నాడు జగన్నాధం ఇంతలో సుబ్బరామయ్య మాటలు బిగ్గరగా వినిపించ సాగినయ్

"అబ్బాయి చెప్పితే మాత్రం - నువ్వెట్లా చేవ్రాలు పెట్టావమ్మా - అంతెలొందరేం"

సుదర్శనమ్మ అనే మాటలు వినబడలేదు

"నేను రానా ఇంతలో ఏం ముంచుకపోయిందని నాబాకీ"

" "

"ఏమీ తెలియనిదానివి చేవ్రాలు ఎట్లా పెట్టావ్. ఇంత అమాయకురాలివే - ఎట్లా తెల్లార్చుకుంటావ్" ముఖానికిపట్టిన చెమట తుడుచుకుంటూ జగన్నాధం వున్న ముందరింట్లోకి వచ్చాడు సుబ్బరామయ్య

"రంగయ్యేనా తీరుమానం చేసింది -" జగన్నాధంవైపు చూస్తూ అన్నాడు

"ముందు ఆయన చెప్పిం దేమంటె. " జరిగిన విషయమంతా చెప్పేశాడు జగన్నాధం.

"నేను రానా - యింతలో ఏం ముంచుకపోయిందని - తగినట్టు వాత పెట్టకపోయానా - వ్యవహారమంతా చెడగొట్టి పారేశారు. నేను యిటువంటివాటిని - ఎన్నో పరిష్కారం చేశాను స్వయంగా - యింత అన్యాయం " ముఖం చిట్లించాడు సుబ్బరామయ్య - తాను పెద్దమనిషిగా పరిష్కారం చేసిన అనేక వ్యవహారాలు ఏకరువు పెడుతుంటె - జగన్నాధం ఆశ్చర్యంతో వినసాగాడు

"ఆ కిటుకులన్ని మీ కేం తెలుసు యివిగో వస్నెండువేలకు ప్రోనోట్లు. వాళ్ళని ముప్పతిప్పలు పెట్టి " ఎలా తిప్పలు పెట్టవచ్చునో - వివరంగా చెప్పి

"ఇప్పుడు వినుకొంటె ఏం లాభం మన ఆట్టు పూర్తిగా వాళ్ళచేతుల్లో చిక్కిపోయింది "

"ఇంతమోసం చేస్తారని-"గొణుక్కున్నట్టు మాట్లాడాడు జగన్నాధం.

"నీ పిచ్చికాకపోతే - యీ కాలంలో దాన్ని మోసమని ఎవరంటారు - అదే లౌక్యం "

"తప్పుడు కూతలు కూయడం కూడానా."

"దేనికి కూశాడు. తన సొమ్ము రాబట్టుకోడానికి ఎవరి సొమ్మూ కాజేయటానికి కాదుగా "

జగన్నాధాని కిదంతా అయోమయంగా వుంది దిగాలుపడ్డ మొగంతో చూడసాగాడు.

"సరే - అంతా మించిపోయింది - యికనేంజేస్తాం - నా బాకీ వదులుకోవలసిందే - వదులుకుంటాను " సుబ్బరామయ్య యింత మంచివాడని కలలోగూడా అనుకోలేదు జగన్నాధం మామయ్యపై గల గౌరవంతో అతని హృదయం నిండిపోయింది

"కాని వీళ్లగతి - ఎప్పుడూ వీళ్ళను గురించే నాకు బాధ. తలదాచుకోటానికి కొంపైనా—"

"ఇంటికేం - వుందిగా—"

"ఇల్లు తమది అనే ధైర్యం వాళ్ళకి వుండాలంటె - నీవు నీ భాగం వదులుకొని - వాళ్ళకింత తలదాచుకోటానికి "

సుబ్బరామయ్య కళ్లు చెమ్మగిలినయ్

"ఎంతమాటన్నావు మామయ్యా - ఆ యింట్లో భాగం కోరుతాననా - యిప్పుడే హక్కువిడుదల వ్రాయించేస్తాను "

"వ్రాయించే పెట్టాను - నీవు చేవ్రాలు చేస్తే-"

"ఏది - యివ్వండి."

"ఇప్పుడేంలే - స్థిమితంగా ఆలోచించుకో "

"అనవసరం మామయ్యా! కాగితమిస్తే చేవ్రాలు పెడతాను "

జగన్నాధం హక్కు విడుదలపత్రంపై చేవ్రాలుచేసి దాన్ని సుబ్బరామయ్య చేతికిచ్చాడు

"ఇంకో విషయం - ఆడపిల్లలను కష్టమో - నిష్ఠురమో నేను చూడక తప్పదు. యిక గోపి వాణ్ణి నీవద్ద వుంచుకొని - స్కూల్లో చేర్పించి... "

జగన్నాధంముఖం వెలవెల పోయింది తనజీతం తన కుటుంబానికే అస్తుబిస్తుగా పరిపోతోంది తమ్ముడి భారం నెత్తిన పడే ప్రమాదం - హఠాత్తుగా అతని చెవిని బడటంతో - మామయ్యపై అతనికి వక్క క్షణం క్రిందట ఏర్పడ్డ గౌరవం కర్పూరంలా హరించిపోయింది అతని మనసులోని ఆందోళన స్పష్టంగా ముఖంలో కనబడసాగింది. ఏమీ చెప్పలేక గుటకలు మ్రింగసాగాడు.

"సందేహిస్తున్నావే—"

"సందేహం కాదు నేనూ - అంతంత మాత్రంగా-నెలాఖరున నేను పడే అవస్థ-"

"నేనుమాత్రం లక్షాధికారినా - పరిస్థితులనుబట్టి ఈభారం నెత్తిన వేసుకుంటున్నాగాని మీ పిన్నమ్మ - నీమాట కెదురు చెప్పడం యిష్టం లేక నేగా యింత నష్టపడ్డది ఆమెకు నీపై వున్న నమ్మకం చెడగొట్టుకోవద్దు తర్వాత నీ యిష్టం"

"సరే మామయ్యా. నీ మాట కాదనేదేముంది"

జగన్నాథం భయపడినట్లు సుబ్బరామయ్య చీవాట్లు పెట్టలేదు. అంతకంటె అత్యంత ప్రమాదకరమైన భారాన్ని నెత్తిన వేశాడు ఇంటివాక్కు వదులుకొన్నాడు దాని కతని భార్య ఏమంటుందో - జగన్నాథం విషణ్ణవదనుడై - ఆందోళనతో నిండిన మనస్సుతో మామయ్యను వదిలించుకునే వుద్దేశ్యంతో లేచి వీధికి బయలుదేరాడు

జగన్నాథం యింటికివచ్చేప్పటికి బాగా చీకటిపడ్డది రాజమ్మ దీపం వెలిగిస్తూవుంది. సుబ్బరామయ్య ఎటు వెళ్ళాడో యింట్లో లేడు

"పిల్లకాయలేరి - " భార్య దగ్గరికిపోయి అన్నాడు జగన్నాథం.

"ఎందుకూ - "

"కనపడకపోతేనూ - "

"అంతశ్రద్ధ వుండబట్టే యీపని జేసింది"

"ఏంజేశాను రాజ్యం - "

"ఆ కొంపాగూడా పిల్లలకు లేకుండా - ఎంత నేను కొట్టుకున్నా మీకు లక్ష్యముంటేగా - "

"వాళ్లకదైనా లేకుండా - "

"మీకు మహావున్నట్టు - "

"మెల్లిగా - ఏమిటా కేకలు - మనకు లేదు అట్లని"

"అంతా పూజ్యం చేసుకొండి"

"వాళ్ళస్థితి - "

"వాళ్ళస్థితికి మీకేం వగవ పనిలేదు. మీ మామయ్యదగ్గర మొత్తంగా వుంది" అంటూ మెల్లిగా ఏదో చెప్పింది. జగన్నాథం పూర్తిగా నమ్మలేదు.

"ఎవరు చెప్పారు"

"వొకరేమిటి అందరూ."

"అప్పుడే ఎందుకు చెప్పలేదు"

"ఏది మాట్లాడబోయినా కొట్టబోయినంత పని చేస్తుంటిరే"

"గోపీని కూడా తీసుకపోమ్మంటున్నారు"

"వాడే నాకు చెప్పింది యితరులు చెప్పారు గాని నమ్మలేదు గోపీ మనతో వచ్చే వుత్సాహంతో యింటిగుట్టంతా చెప్పేశాడు."

"ఆ - ఎంత మోసం "

"ఏమిటే - మళ్లీ ఏమొచ్చింది-" అప్పుడే వీధిలోనుంచి వచ్చిన సుబ్బరామయ్య ఆశ్చర్యంగా అన్నాడు

"ఏముంది - మీరుకూడా యీమాదిరి చేస్తారని ఎప్పుడూ అనుకోలేదు"

"ఏం జేశాను"

"ఈ నాలుగేళ్లనుండి-యిక్కడ అప్పులు చేసిన మొత్తం - వచ్చిన వరుమానం - అంతా మీ దగ్గరకు మొత్తంగా వచ్చినదటనే"

"ఎవరు చెప్పారు"

"అందరూ - వొకరని ఏముంది అబద్ధమంటారా"

"నిజమే - ఆ డబ్బే లేకుంటే వాళ్లగతి."

"అయితే మీకదో వొరగబెట్టునట్టే చెపుతుంటిరే"

"మాకు తగింది మేము వొరగబెట్టినా-నీమాదిరి తెలివితక్కువగా వున్నదికాస్తా పరులపాలు చెయ్యలేదు"

"అన్యాయంగా నాచేత యిల్లు వ్రాయించుకున్నారు"

"నీవల్ల నాలుగయిదు వేల రూపాయలు నష్టపడ్డాము - యింటికేమో మహా విచారిస్తున్నావు—"

"పైగా గోపీని తీసుకపొమ్మని - నాకది సాధ్యంకాదు"

"వొకప్పుడు నీవు తెల్లకుట్టవనుకున్నానా—"

"ఇంత జేసినా మీకు—"

"చేశావులే - పో - ఏమో జేశాటడ-" సుబ్బరామయ్య దొడ్లోకి పోబోతూ వొక్కక్షణం నిలబడి అన్నాడు

"మీరూ పెద్దమనుషులేగా-" హేళనగా అన్నాడు జగన్నాథం సుబ్బరామయ్య దీనికేమీ జవాబియ్యకుండా జగన్నాథం వైపు చురచుర జూసి దొడ్లోకి వెళ్లాడు

"రాజ్యం, ప్రయాణానికి సిద్ధంకా-బండి తెస్తాను"

"ఎప్పుడో సర్దేశాను నాదేమీ ఆలస్యం లేదు."



ఇంటి యజమానురాలు :
"ఈ గదికి ముప్ఫయ్ రూపాయిలు అద్దె అని చెప్పినా ముందుకు దూకేవాళ్లున్నారు ........"

గదికోసం వచ్చినమనిషి :
"అవును, అందులో ఆశ్చర్యం లేదు. దూకడమేమిటి, నాకు మూర్ఛపర్యంతం అయితేను."

★ ముచ్చటగా ముగ్గురు ★

(34-వ పేజీ తరువాయి)

దాంతో మౌంట్ మొరస్సీకి భరించరాని కోపం వచ్చి, ఒక్కసారిగా కెటిల్‌మీదికి ఎగిరి దూకి, కెటిల్ తాలూకు గొట్టాన్ని గట్టిగా పళ్ళతో పట్టుకు కొరకబోయింది.

మౌంట్ మొరస్సీలో విపరీతమైన మార్పు వచ్చింది. సంధ్యాకాలపు నిశ్శబ్దతను చీల్చుకొంటూ, పెద్దగా రొదపెట్టుతూ, గంటకి ముప్ఫైఐదు మైళ్ల వేగంతో పరిగెత్తి, ఆ లంకచుట్టూ మూడుసార్లు ప్రదక్షిణాలు చేసింది. దారిలో ఎక్కడ యింత బురద కనిపించినా, అక్కడ నిలబడిపోయి, తన ముట్టె అందులో కాస్సేపు దూర్చేది.

ఆరోజు మొదలుకొని మౌంట్ మొరస్సీకి కెటిల్ పేరు వినగానే ఎక్కడలేని ధుమధుమ చిరచిర పుట్టుకు వస్తాయి. అథవా ఎప్పుడైనా కెటిల్ చేసే మోత దాని చెవిని పడితే, తన కింకేదో అర్జంటుగా పనిపడినట్లు, బోటులోనుంచి బయటికి దూకేసి, మేము టీలు తాగటం పూర్తిచేసేదాకా ఒడ్డుమీదనే కూర్చునేది.

(ఇంకా వుంది.)

## ★ స్వార్థంకోసం ★

(10-వ పేజీ తరువాయి)

మించిపడ్డ తాపీ మేస్త్రీని చూశాను! పెద్దపులి తింటున్న సర్కసు పనివాణ్ణి చూశాను. గడమీదనుంచి .

ఫొటోగ్రాఫర్: రెండు రీళ్ళు తగలెట్టాను, వీడికోసం. వీడు పడి తీరవలసిందే!

కొండమీద మనిషి: దింపవయ్యా, బాబోయ్!

ప్రొప్రయిటర్ అయ్యా అతనికి పడి పోవాలని లేకపోతే అతన్ని పడెయ్యడం నా ధర్మంకాదు! క్షమించాలి! నేను చెయ్యగలిగినదంతా చేశాను! అతని కిష్టం లేకుండా పడేస్తే తప్పు నాదవుతుంది! ఇలాటి పనులు నా కలవాటులేదు కూడాను!

లావుపాటి ఆవిడ: వీల్లేదు!

వేస్టుకోటు వీల్లేదు! అతను పడి తీరాలి (తుపాకీ ఎత్తుతాడు)

ప్రొప్రయిటరు అయ్యా, అయ్యా, అయ్యా, ఇప్పుడుకాదు. మరోమాటు అల్లాగే చేదాం

కొండమీద మనిషి: మరోమాటేమిటయ్యోయ్!

ప్రొప్రయి: నీ పుణ్యం వుంటుంది, నువ్వు నోరుముయ్యవయ్యా బాబూ!

కొండమీద మనిషి: మరోమాటు ఛస్తే ఎక్కను! పదివేలను రూపాయిలన్నరకే!

వేస్టుకోటు. పోలీసూ! (ప్రొప్రయిటర్ని చూపించి) ఇతన్ని నువ్వు అరెస్టు చెయ్యాలి!

ప్రొప్రయిటరు పోలీసుగారూ! పడనన్నవాడిని పడెయ్యడం నాధర్మం కాదు!

పోలీసు ఏమయ్యా, కొండమీదాయనా, నువ్వు పడతావా, పడవా చెప్పు!

కొండమీద మనిషి: పడను మొర్రో అంటూంటే!

పోలీసు: విన్నారా! అతను పడడుట!

విలేఖరి (రాస్తూ) "స్వార్థంకోసం కూలికి వొక మనిషిని తెచ్చి కొండమీద కట్టి పన్నిన కుతంత్రం"

1వ యాత్రీ: ఎల్లా దింపుతారంటారూ?

2వ యాత్రీ: కప్పీ లుంటాయండీ!

1వ యాత్రీ. చాల్లెండి, కప్పీ లెల్లా వుంటాయి?

2వ యాత్రీ పందెం వేస్తారూ? ఎంతెంత పందెం?

1వ యాత్రీ. పదేసి రూపాయలు! ఖరారేనా? కానెయ్యండి,

లావుపాటి ఆవిడ: మరయితే అతనెప్పుడు పడతాడు?

ప్రొప్రయి ఇంకోమాటు! . ఇంకోమాటు! ఇప్పుడుకాదు! అప్పుడు తాడు వొదులుగా కడతాలెండి! సరేనా? ★

## సౌండ్ బారియర్

(50-వ పేజీ తరువాయి)

చిత్రాలు తీసిన డేవిడ్ లీన్ డైరక్టు చేశాడు సర్ రాల్ఫ్ రిచర్డ్‌సన్, అన్‌టాడ్, నీగెల్ పాట్రిక్ మున్నగువారు నటించారు

శబ్దవేగాన్ని (గంటకు 750 మైళ్ళు) మించి జెట్ విమానం నడపాలని బ్రిటిష్ వైమానికులు చేసిన సాహస ప్రయత్నాలు ఈచిత్రంలో కథావస్తువు.ఈప్రయత్నాలకు

ఒక విమాన పారిశ్రామికుడు ప్రోద్బల మిస్తూంటాడు అతని కుమార్తెను పెండ్లాడిన వైమానికు డొకడు జెట్ విమానాన్ని 750 మైళ్ళ వేగాన్ని మించి నడపాలని

ప్రయత్నించి ఆ ప్రయత్నంలో ప్రమాదానికి లోనై మరణిస్తాడు. పారిశ్రామికుడు మళ్లీ మరొక వైమానికుణ్ణి ప్రయత్నించమని ప్రోత్సహిస్తాడు పారిశ్రామికుని కుమార్తె తండ్రితో తీవ్రంగా వాదిస్తుంది "శబ్దవేగాన్ని జయించి నువ్వేమి సాధించుదామనుకుంటున్నావు? ప్రాణం అంటే నీ కింత చులకనా? అని విజ్ఞాన శాస్త్రం ప్రపంచ కళ్యాణానికే తోడ్పడుతుందనీ, తను బుద్ధిపూర్వకంగా ఎవరి ప్రాణాలూ బలియివ్వడం లేదనీ, తండ్రి చెప్పినా ఆమె నమ్మదు ఆఖరున ఒక వైమానికుడు శబ్దవేగాన్ని జయిస్తాడు అప్పుడామె తను తొందరపడి శాస్త్రాన్ని, తండ్రి మనస్సునూ శంకించినందుకు పశ్చాత్తాప పడుతుంది

సైన్సుకు సంబంధించిన కథా వస్తువైనా, ఈ చిత్రంలో ప్రేక్షకులకు అత్యంతాసక్తి కలిగించే 'డ్రామా' ఉన్నది. టెక్నికల్‌గా అత్యుత్తమ చిత్రాల్లో ఒకటిగా ఎన్నదగినది ఆకాశంలో విమానవేగాన్ని చూపించే దృశ్యాలు గొప్ప ఫొటోగ్రఫీకి నిదర్శనాలు. ఎడిటింగ్‌తో ఎంత 'ఎఫెక్ట్' కలిగించవచ్చునో ఈ చిత్రం చూపిస్తుంది. ★

## ★ శరన్మేఘాలు ★

(11-వ పేజీ తరువాయి)

"ఔను. విశ్వాసం కుక్కలకే ఉండటం లేదు, ఇక మనుషుల కుంటుందా?"

"ఔను, ఆవేళ సూరిగాడు చెప్పనే చెప్పాడు. కాని బుద్ధిగడ్డి తిని, వెధవ ఆశయాలకోసం ఉన్న రహస్యం నీతో చెప్పిన మూలాన గాని, లేకపోతే, అందరి మొగుళ్ళ లాగే, నీ మొగుడూ పరాయి ఆడదాన్ని కన్నెత్తి చూడడనీ, రాత్రి పదయినా నీ కోసం ఇంటికి వస్తాడనీ మురిసి, ముద్దులు కురిపించేదానివి ఏం?" అంటూ, అన్నం సగంలోనే లేవబోయాడు

"ఇదిగో మీరు లేస్తే నేను చచ్చినంత ఒట్టు. మీకోసం చేశాను, ఈ ఉల్లికారం, పెసరపప్పు పచ్చడీనూ" అని, కన్నీరు పూర్తిగా తుడుచుకొని, రెక్కట్టుకు కూచో బెట్టింది

అతను పీటమీదకు కూలాడు

"ఒట్లూ, ప్రతిజ్ఞలూ దేనికి? ఇంక నా గొంతులోంచి మెతుకు దిగొద్దూ!" అని, తటాయించాడు

"నేను కలిపి పెడ్తాను" అని, నవ్వుతూ చూసింది.

"పచ్చి ఔలకాయ గొంతులో దిగ గొట్టి, పంచభక్ష్యాలూ వడ్డించి ఏంలాభం?" అని, తల దించాడు ఆమె నెమ్మదిగా అన్నం కలిపి, అతనికో ముద్ద అందిస్తూ, తనో ముద్ద తినసాగింది

"అలా ఏడవకూడదమ్మా?" అని, మధ్య వ్రేలితో నెత్తిమీద మొట్టాడు

"అంతే, నే నేడవాల్సిందే కాని, మీ నోటితో మీరు కూర్చోమనరుగా" అని, పంటిక్రింద నాలిక పెట్టి వెక్కిరించింది

అతను కోతిలా మూతి పెట్టాడు ★



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras.

సిద్ధముగానున్నది.

# విచిత్రవ్యక్తి

మూలం:-

మార్క్ ట్వేన్





అనువాదం:

నండూరి రామమోహనరావు

ప్రతి గొప్ప రచయితా నాటకం రాసినా, నవల రాసినా, కావ్యం రాసినా తన రచనలో తన్ను ప్రతిబింబింపజేసుకుంటాడు. ప్రపంచం మీద తన అభిప్రాయ మేమిటో ప్రత్యక్షంగానో, పాత్రలద్వారానో చెప్పి తీరుతాడు. మార్క్ ట్వేన్ రాసిన నవలల్లో మార్క్ ట్వేన్ పూర్తిగా కనిపిస్తాడు. అతని గొప్పనవలల్లో ఒకటైన "Mysterious Stranger" లో సైతాను భాషలో మార్క్ ట్వేన్ మాట్లాడుతూ మానవజాతిమీద, చరిత్రమీద తనకు గల అక్కసునంతా తీర్చుకుంటాడు. ఇప్పటి ప్రపంచ పరిస్థితిలో— మన గత చరిత్రలో గర్వపడాల్సిన కారణాల కంటె సిగ్గు పడాల్సినకారణాలే ఎక్కువగా ఉన్నాయనే సంగతి జ్ఞాపకంచేసుకోవడం కోసం ఈనవల చదివితీరాలి.

## ఆంధ్రగ్రంథమాల

మదరాసు-1